# లేవీయకాండమందలి అర్పణలు

## వాటియందు గుప్తమైన క్రీస్తుప్రభువు )

రచన:

ఏ. జీ. షైయార్

క్రిస్టియన్ పబ్లిషింగ్ హౌస్

పోస్టుబాక్సు నెం. 36

రాజమండ్రి

1956

# విషయసూచిక

# పీఠిక



భూమిపై జీవించిన గొప్ప బోధకుడైన యేసుక్రీస్తు ఉపమానరీతిగా బోధించెను. ఉపమానము లేక ఆయన వారికేమియు బోధింపలేదు. ( మత్తయి 13 : 34—35 ) ఆయనను పోలిన బోధకుడెవడు? ( యోబు 36 : 22 ) ఆత్మీయమైన అనేక గొప్పవైన సంగతులను ఉపమానరీతిగా దేవుడు పాత నిబంధనలో బోధించెను. లేవీయకాండములోని మొదటి యేడు అధ్యాయములలోని అయిదు విధములైన బలులు, మనకొరకు తన్నుతాను బలిగా అర్పించుకొన్న యేసుక్రీస్తుయొక్క అర్పణను గూర్చి మనోహరమైన సత్యములను బోధించుచున్నవి. ( హెబ్రీ 9 : 14 ) ఈ బలులను గూర్చిన సత్యమైన బోధను ప్రభువైన యేసుక్రీస్తుయొక్క అమూల్యమైన రక్తముచేత విమోచింపబడినవారు మాత్రమే అంగీకరింపగలరు. యేసుప్రభువు చేసిన పాప ప్రాయశ్చిత్త బలి చాల ఆశ్చర్యమైనదియును, విశ్వాసికి నిండైన దీవెనకరమైనదియు నై యున్నది. ఈ బలి యొక్క విలువను వర్ణించుటకు మానవ భాష చాలదు. ఒకే బలి యేసుప్రభువుయొక్క మరణమును గూర్చిన మర్మమంతటిని బోధింపజాలదు. దేవుడు తన ధర్మశాస్త్రమునుండి ఆశ్చర్యకరమైన సంగతులను మనకు చూపుటకు ( కీర్త 119 : 18 ) యేసుక్రీస్తుయొక్క మరణమును

వివరించు యీ ఐదు విధములైన బలులను గూర్చిన దృశ్య మును మనకు అనుగ్రహించెను.

## ఈ అర్పణలు యేవనగా :

1. దహన బలి 2. నైవేద్యము 3. సమాధాన బలి 4. పాప పరిహారార్థ బలి 5. అపరాధ పరిహారార్థ బలి.

ఆశ్చర్యకరమైన యీ యైదు బలులను గూర్చి మనము చదువునప్పుడు దావీదువలె దేవా! నీ ధర్మశాస్త్రమునందు ఆశ్చర్యకరమైన సంగతులను చూచునట్లు నా కన్నులను తెరువుము అని ప్రార్థింతుము గాక.

# 1. దహన బలి

దేవుడు మానవులను యథార్థవంతులనుగా సృజించెను. (ప్రస 7 : 29) యథార్థవంతుడైన మానవుడు పరిశుద్ధుడైన దేవునితో సృష్ట్యారంభమున దినదినము నిరాటంకమైన సహవాసము చేసెను. సిగ్గు, భయములు లేకుండ దేవుని సన్నిధికి స్వేచ్ఛగా చేరగలిగినాడు. (ఆది 3 : 8) నరులతో సహవాసము చేయుట దేవునికి మిక్కిలి యిష్టము. నరసహవాసము దేవునికి మిక్కిలి ప్రియమైనది. (సామె 8 : 31) పాపము చేసినప్పుడు అట్టి సహవాసమును మానవుడు పోగొట్టుకొని యున్నాడు. గాన ఆయనయొక్క దివ్యసన్నిధికి రాలేకపోయినాడు. మానవుడు దేవునికి భయపడెను. (ఆది 3 : 10) అప్పటినుండి మనుష్యులు దేవునికి దూరస్థులైపోయినారు. (ఎఫె 2 : 13) బలి వలన మాత్రమే నరుడు తిరిగి దేవుని సన్నిధి సహవాసమును పొందగలడని దేవునిచేత నేర్పించబడెను. ఆదాము, హవ్వలు పాపము చేసినప్పుడు దేవుడు వారికి చర్మపు చొక్కాయిలను తొడిగించెను. ఆ చర్మములు కావలెనంటే నిర్దోషమైన మృగములు చంప బడవలెను. (ఆది 3 : 21) అనగా రక్తము చిందింపకుండ పాపక్షమాపణ కలుగనేరదని అర్థము. (హెబ్రీ 9 : 22).

భయము లేకుండ దేవుని సన్నిధికి చేరగలుగుటయే మానవునకు ప్రాముఖ్యముగా కావలసిన అవసరము. దహన బలి రూపముగా యేసుక్రీస్తు మనకు యీ యవసరమునుతీర్చ

యున్నారు. నిజముగా ఆయనతో సహవాసము చేయుట ఆనందింపదగినది. మనము సమస్త ప్రవర్తనలలోను పరిశుద్ధులుగా నుండవలెను. (I పేతు 1:16) దేవునితో సహవాసము కలిగియుండుటకు ముందుగా ఆయనతో సమాధానము కలిగి యుండవలెను. యేసుక్రీస్తు తన రక్తము వలన ఆ సమాధానమును మనకు కలిగించెను. (కొలొ 1:20) కనుక మనకొరకైన సమాధాన బలి యేసుక్రీస్తే. మనము దేవునితో మొదటగా నడుచుచుండగా పాప సంబంధమైన స్వభావము మనలో నున్నదనియు, ఆ స్వభావము దేవునినుండి మనలను దూరపరచుచున్నదనియు గ్రహించుకొనగలము. (రోమా 7:24) యేసుక్రీస్తు మనకొరకైన పాప పరిహారార్థ బలియై యున్నాడు గాన, మనము నిరాశపడ నక్కరలేదు. (II కొరింథీ 5:21) మాటల యందును క్రియల యందును తలంపులయందును దినదినము అపరాధులమై యున్నట్లు కనుగొనుచున్నాము. (ప్రసం 7:20) మనము నిరుత్సాహపడనక్కరలేదు. ఎందుకనగా యేసుక్రీస్తు మనకొరకైన అపరాధ పరిహారార్థ బలియై యుండి, మన పాపములను మనము ఒప్పుకొనిన యెడల ఆయన మన పాపములను క్షమించి సమస్త దుర్నీతినుండి మనలను పవిత్రులనుగా చేయును. (I యోహా 1:9) ఔను, ఆయన నమ్మతగినవాడును నీతిమంతుడునై యున్నాడు. ఈ బలులను గూర్చి ధ్యానించునపుడు తేబడిన అర్పణ, అర్పణ నర్పించు వ్యక్తి, యాజకుడు అను విషయములను జాగ్రత్తగా గమనించవలెను.

అర్పించు వ్యక్తిగా యేసుక్రీస్తు మానవత్వమును సంపూర్ణముగా కలిగియుండి, మన నిమిత్తము దేవుని ధర్మశాస్త్రమంతటిని నెరవేర్చిన వాడై యున్నాడు. (రోమా 5:19) అర్పణముగా యేసు మన పాపములను భరించు బలియై చనిపోయి దేవునికి ప్రీతికరమైన సువాసన కలిగించు వాడై యున్నాడు. (ఎఫె 5:2; యోహా 1:29) యాజకుడుగా యేసు దేవునికిని, మానవులకును నడిమి యున్న మధ్యవర్తియై యున్నాడు. (I తిమో 2:5)

అర్పణను తెచ్చినవాడు బలి పశువు తలమీద తన చేతులను గట్టిగా ఒత్తి యుంచుట దేవుని చేత నియమించబడిన అర్పణ మీద వ్యక్తి గట్టి నమ్మకమును ఉంచుటకు సూచనగా వున్నది. అతని పక్షముగా యీ యర్పణ అంగీకరించబడినది. (లేవి 1:4)

లేవీయకాండములోని యీ యైదు బలులు రెండు పెద్ద భాగములుగా ధ్యానించబడినవి. 1. సువాసనకరమైన అర్పణ. 2. సువాసనలేని యర్పణ.

సువాసనకరమైన అర్పణలు-: (ఎ) దహనబలి (1:9, 13, 17.) (బి) నైవేద్యము (2:2, 9; 6:15.) (సి) సమాధాన బలి (3:5, 16.)

యేసుప్రభువే యీ సువాసనకరమైన బలులయొక్క నిజస్వరూపమై యున్నాడు. మరియు క్రీస్తు మిమ్మును ప్రేమించి

పరిమళవాసనగా నుండుటకు మనకొరకు తన్నుతాను దేవునికి అర్పణముగాను బలిగాను అప్పగించుకొనెను. (ఎఫె 5 : 2)

సువాసనలేని యర్పణలు (ఎ) పాపపరిహారార్థ బలి (4 : 3) (బి) అపరాధ పరిహారార్థ బలి (6 : 5)

సువాసనలేని యర్పణగా యేసు యీ బలులయొక్క నిజస్వరూపమై యున్నాడు. వేటిరక్తము పాపపరిహారార్థముగా పరిశుద్ధ స్థలములోకి ప్రధాన యాజకునిచేత తేబడునో ఆ జంతువుల కళేబరములు శిబిరమునకు వెలుపట దహింపబడును. కావున యేసు కూడ తన స్వరక్తముచేత ప్రజలను పరిశుద్ధ పరచుటకై గవిని వెలుపట శ్రమ పొందెను. ( హెబ్రీ 13 : 11–12 )

## దహనబలి — వివరములు

లేవీయకాండములో మొదటిదిగా చెప్పబడిన అర్పణ దహనబలి. సీనాయికొండమీద ధర్మశాస్త్రము అనుగ్రహింపబడకముందు అర్పింప బడిన అర్పణలన్నియు దహనబలులని పాత నిబంధనలో తేటగా వ్రాయబడియున్నది. ( ఆది 4 : 4; 8 : 20; 22 : 1–14; యోబు 1 : 5. ) ఈ దహనబలి దేవుని చేత అంగీకరించబడినదై యుండి, మానవుడు దేవుని సన్నిధికి చేరగలుగు మార్గమై యున్నది. అను సత్యమును చూపించుచున్నది. దహనబలులన్నియు విశ్వాసమూలముగా అర్పించ

బడినవి. ( హెబ్రీ 11 : 4) విశ్వాసమూలముగా మానవుడు దేవుని సన్నిధికి చేరవలసినవాడై యున్నాడను దైవస్థితమును మానవుడు మొదటిదిగా నేర్చుకొనవలసిన పాఠమైయున్నది.

దహనబలి ప్రతిదినము అర్పించవలసిన యర్పణమై యున్నది. ( నిర్గ 29 : 38—43. ) విమోచింపబడిన జనాంగముతో లేవీయకాండము ప్రారంభింపబడినది. తన సన్నిధికి రావలసినదని వారు దేవునిచేత పిలువబడిరి. సమాధానమును దైవాశీర్వాదమును దేవునికి వేరుగానుండిన వారిమధ్య లేవు. ఎప్పుడు మనము ఆయన సన్నిధిలోనుండి ఆయనతో సమాధానము కలిగియుందుమో అప్పుడే ఆయనకు అనుకూలమైన సేవ చేయగలము.

దహన బలినిగూర్చి కొన్ని ప్రాముఖ్యమైన సంగతులను గమనింతము. ఇది సువాసనకరమైన అర్పణ. మరియు అది అంగీకరించబడుటకు అర్పించబడెను. ( లేవీ 1 : 9, 4. )

1. ఇది పాపపరిహారార్థ బలి నుండియు అపరాధపరిహారార్థ బలి నుండియు వేరుగానున్నది. ఎందుకనగా యవి సువాసనకరమైనవి కావు. ఈ బలి నిమిత్తము యాగపశువు చావవలసి యున్నది. గాన నైవేద్యము నుండియు యిది వేరుగా నున్నది. పూర్తిగా దహింపబడుటను బట్టి సమాధాన బలి నుండియు యిది వేరుగా నున్నది.

**2.** దహనబలి నిర్దోషమైనదై యుండవలెను. (లేవీ 1 : 3) అపవిత్రమైన దేదియు దేవునికి అర్పించబడనేరదు. ( మలాకీ

1 : 13 ) దహనబలి పరిశుద్ధుడును సంపూర్ణ మానవత్వము కలిగియున్నవాడునైన యేసును సూచించుచున్నది. (II కొరింథీ 5 : 21; I పేతు 2 : 22; I యోహా 3 : 5; హెబ్రీ 7 : 26; యోహా 8 : 46. )

3. దహన బలి దేవుని సమీపించుటకు మానవుని కొరకు బలియై యున్నది. ( లేవీ 1 : 3 ) ఈ దహన బలి మూలముగా మనము దేవుని సన్నిధికి చేరగలుగు చున్నాము. ( యోహా 10 : 9; రోమా 5 : 2; ఎఫె 2 : 13; 2 : 18; 3 : 12; హెబ్రీ 10 : 19 – 20. ) ఇప్పుడు ప్రతి విశ్వాసియు సిగ్గును భయమును లేకుండ దేవుని సన్నిధికి నిరాటంకముగా చేరవచ్చును. (II సమూ 14 : 14. )

4. ఇది స్వీకరింపబడవలసిన యర్పణ. ( లేవీ 1 : 4. ) ఒకప్పుడు మనము పాపములవలనను పాపసంబంధమైన తలంపుల వలనను చెడిపోయిన వారమైయుండి, యిప్పుడు యేసు క్రీస్తునందు సమీపస్థులమై దేవుని సన్నిధికి చేరగలిగితిమి. ( కొలా 1 : 20–22; ఎఫె 1 : 6; రోమా 8 : 1; I సమూ 2 : 8 ) దేవునికి అర్పించబడిన యీ దహనబలి దానియొక్క సజీవమైన సర్వసంపూర్ణతతో అర్పించ బడెను. అది చంప బడి బలిపీఠము మీద దహించబడినది. ఈ బలి క్రీస్తుకు సాదృశ్యముగా నుండి మనము దేవునికి అచ్చియున్న యీమావత్తును తీర్చి, ఆయనను పూర్ణహృదయముతోను, పూర్ణాత్మ

సూచించుచున్నవి. (హెబ్రీ 9 : 22; 10 : 20) బలి పశువు చావవలెను. అనగా అర్పణ తెచ్చినవాడు అంగీకరించబడెను అని అర్థము.

7. రక్తము బలిపీఠముచుట్టు ప్రోక్షింపబడినది. (లేవీ 1 : 5) ఈ రక్తము ప్రోక్షించబడిన విధానములు నానావిధములుగా నున్నవి. (ఎ) దహన బలిలో రక్తమంతయు బలిపీఠము చుట్టు ప్రోక్షించబడెను. ఆ యర్పణను దేవుడు పూర్తిగా నంగీకరించుటకు యిది సూచనగా వున్నది. ఎందుకనగా ప్రాణము రక్తములో నున్నది. (లేవీ 17 : 11) (బి) కొన్ని యర్పణలలో రక్తము కొంతమట్టుకు బలిపీఠముచుట్టు ప్రోక్షించబడెను. అనగా యేసుప్రభువుయొక్క రక్తము మనలను పవిత్రపరచునట్టి శక్తి కలిగియున్నదనుటకు గురుతుగా నున్నది. (I యోహా 1 : 7) (సి) రక్తమంతయు పోయవలెను. (లేవీ 4 : 18) అనగా యేసుస్వామి తన ప్రాణము యావత్తు మన కొరకు ధారపోసెనని యర్థము. (యెష 53 : 12) రక్తమంతయు పోయబడుటను బట్టియే దహనబలి దేవునిచేత అంగీకరించబడినది. అనగా యేసు స్వామి యొక్క పవిత్ర జీవితము దేవునికి కేవలము ప్రీతికలిగించునదిగా యున్నదని భావము. (మత్త 3 : 17; 17 : 5)

8. బలిపశువుయొక్క చర్మము యాజకునికి యివ్వబడెను. (లేవీ 7 : 8) ఈ చర్మము రక్షణవస్త్రములకు సూచనగా నున్నది. (యెష 61 : 10) ఈ చర్మము యాజకునికి

చెందుట యనగా మన రక్షణయొక్క సంపూర్ణ మర్మము యేసుప్రభువునకే చెందియున్నదనియు, ఆ మర్మమును ప్రభువు మాత్రమే సంపూర్ణముగా యెరిగియున్నాడని యర్థము. జంతు శరీరమునకు ఆ చర్మమును దేవుడే నియమించెను. మన రక్షణవస్త్రమును దేవుడే నియమించెను. రక్షణవస్త్రము ధరించుట — మనము యేసును ధరించుటకు సూచనగావున్నది. (రోమా 13 : 14; గల 3 : 20) ఈ సంగతిని మరి విశేషముగా గ్రహించుటకు, ఆది 3 : 7 ను. యెష 64 : 6 తోను, ఆది 3 : 21 ను యెష 61 : 10 తోను పోల్చుము. (జకర్య 3 : 1—5; మత్తై 22 : 11—12; లూకా 15 : 2; రోమా 9 : 30; I కొరిం 1 : 30; జఫన్య 1 : 7—8.)

9. ఇది ఆరాధన అర్పణ. (ఆది 22 : 2, 5; II దినవృ 23 : 18; 29 : 27—30; హెబ్రీ 13 : 15.) యేసుక్రీస్తు బలి యగుట దేవునికి ప్రీతికరమైనదియును, ఆయనను సంతోష పరచునదియు నైయున్నదని ఎప్పుడు గ్రహింతుమో అప్పుడు మాత్రమే మనము నిజమైన ఆత్మీయనారాధనను, ఆరాధించు వారముగా నుందుము. ఆత్మసంబంధమైన యర్పణలను నర్పిం చుటకు మనము దేవునికి పరిశుద్ధ యాజకులముగా నున్నాము. (I పేతు 2 : 5) ఆత్మతోను సత్యముతోను ఆరాధించుదమా? అట్టి యారాధనను తండ్రి కోరుచున్నాడు. (యోహా 4 : 23)

లేవీయకాండములోని మొదటి యధ్యాయమును మనము జాగ్రత్తగా చదివిన యెడల దహనబలిగా నర్పించ

బడునది యెద్దుగాని, గొర్రెగాని, మేకగాని గువ్వగాని యై యున్నదని గ్రహించగలము. దేవుని బలి పీఠము మీద యే యితరమైన జంతువుగాని పక్షిగాని యర్పించబడ లేదు. పలాని జంతువులను దేవుడు యెందుకు యేర్పాటు చేసెనో దానిని ఆయన దివ్యవాక్యమే మనోహరముగా బోధించును.

ఎద్దు:—దహనబలిగా నర్పించబడిన పశువులలో యిది పెద్దదియును, మిక్కిలి విలువైనదియును నై యున్నది. ఇది యెహోవా సేవకుడును, ఆయన వలన భారము మోపబడిన వాడునైన యేసును చూపించుచున్నది. (యెష 42 : 1; కీర్త 144 : 14) మన పాపములను భరించినవాడు యేసుప్రభువే! (యెష 53 : 6, 11, 12; యోహా 1 : 29; హెబ్రీ 9 : 28; I పేతు 2 : 24) రక్షకుడు తన ప్రజలయొక్క భారములను కూడ భరించువాడై యున్నాడు, (కీర్త 68 : 19; I పేతు 5 : 7) క్రీస్తు విశ్వాసిని కూడ భరించుచున్నాడు. (ద్వితీ 33 : 12; లూకా 15 : 5) రాబోవు కాలములో క్రీస్తు లోక రాజ్యముల భారమును తన భుజములమీద భరించువాడై యున్నాడు. (యెష 9 : 6.) ఎద్దు బలమునకు గురుతుగా నున్నది. (సామె 14 : 4.) మన విమోచకుడు బలవంతుడు. (యిర్మీ 50 : 34.) ప్రతి విశ్వాసియు యేసు క్రీస్తునందు బలవంతుడుగా నుండవలెనని యాజ్ఞాపించబడినది. (ఎఫె 6 : 10; ఫిలి 4 : 13; II తిమో 2 : 1; 4 : 17) నీవు బలవంతుడైన క్రైస్తవుడుగా నున్నావా? ఎద్దు వున్నచోట గాదెయందు

ధాన్యముండును – అనగా యెద్దు వలన ఆహారము సమృద్ధిగా వచ్చును. (సామె 14 : 4) అనగా యేసుక్రీస్తు మన ఆత్మీయ మైన జీవాహారమై యున్నాడని యర్థము. (యోహా 6 : 51)

గొఱ్ఱె:—ఇది వధకు తేబడిన గొఱ్ఱెవలె హానిని భరించి, ఎదిరించక తన్నుతాను దేవునికి బలిగా అర్పించు కొనిన యేసుప్రభువునకు సాదృశ్యముగా ఉన్నది. గొఱ్ఱె సాధువైన జంతువు. యిర్మీ 11 : 19; మత్తై 11 : 29; II కొరింథీ 10 : 1 వచనములలో మన ప్రభువైన యేసు స్వామిని సాధువైన గొఱ్ఱెగా చూడగలము. మన ప్రియ రక్షకుడైన యేసుస్వామికి గొఱ్ఱె అను పదము లేఖనములలో సారిసారిగా వాడబడినది. దేవుని వాక్యములో యీ మాట చాల సార్లు కనబడును. ప్రక 6 : 16 లో గొఱ్ఱె పిల్లయొక్క ఉగ్రతను గూర్చి చదువుదుము. ఇది ఒక ఆశ్చర్యకరమైన వర్ణన. సామాన్యముగా చెప్పితే గొఱ్ఱెపిల్ల ఉగ్రతకు భయ పడువారెవరు? యేసుప్రభువు తిరిగి వచ్చినపుడు ఆయనను అంగీకరించక తృణీకరించినవారిమీద ఆయన ఉగ్రత కుమ్మ రించబడును. దేవుని గొఱ్ఱె పిల్లను నీ స్వంతరక్షకునిగా అంగీకరించుకొని యున్నావా? (యోహా 1 : 29.) అలాగైన యెడల ఆయన యుగ్రత నీ మీదికిరాదు. (యోహా 5 : 24)

మేక:—ఇది యేసుప్రభువుయొక్క పరిపూర్ణమైన నడతకు సాదృశ్యముగానున్నది. పరిశుద్ధ లేఖనములలో మేక ఠీవిగా నడుచు జంతువుగా వర్ణించబడియున్నది. (సామె

30 : 30, 31) నడుచుచున్న యేసువైపు యెప్పుడైన చూచి నావా ? (యోహా 1 : 36) అపోస్తలులు నడుచుచున్న యేసు అను మాటను యెక్కువగా వ్రాసియున్నారు. (I పేతు 2 : 21; ఎఫె 5 : 2; I యోహా 2 : 6) ఆయన అడుగు జాడల ననుస రించి నడుచుకొందమా ? మేక యేసును పాపములను భరించు వానిగా చూపుచున్నది. (లేవీ 16 : 21–22) ప్రభువు సిలు వలో చనిపోయినప్పుడు లోకపాపమంతటిని భరించెను. (I పేతు 2 : 24; II కొరిం 5 : 21.)

గువ్వ:– ఇది దుఃఖాక్రాంతుడైన యేసును చూపించు చున్నది. (యెష 53 : 3) ఆయన శ్రమలను గూర్చియు గువ్వ సాదృశ్యముగా నున్నది. యెష 59 : 11 ఈ వచనమును లూకా 19 : 41–44; యోహా 11 : 35; హెబ్రీ 5 : 7 వచ నములతో సరిపోల్చి చూడుము. గువ్వ సొగసు అను మాటను కూడ చూపును. (కీర్త 68 : 13) అనగా యేసుప్రభువు రమ ణీయుడును అతి కాంక్షనీయుడునై యున్నాడని అర్థము. ఈ పదమునకు హెబ్రీ భాషలో ఆయన యెక్కువగా కోరతగిన వాడని అర్థ మిచ్చుచున్నది. (పరమ 5 : 16; కీర్త 45 : 1; 91 : 17) గువ్వ నిష్కపటమునకును గుర్తు. (మత్త 10 : 16) యేసుప్రభువు యీ లోకములో ఉన్నపుడు నిష్కపటియు, నిర్దోషియునై యున్నాడు. (I పేతు 2 : 22; హెబ్రీ 7 : 26)

దేవుడు తన ప్రియకుమారునియందు మితిలేని ఆనంద మును అనుభవించినట్లు యింతకుముందు చూచితిమి. లేఖ

నములలో చూడగా దేవుడు మూడు పర్యాయములు ఆకాశ
మును తెరచి యీ ఆనందమునుగూర్చి సాక్ష్యమిచ్చెను.
(మత్తై 3 : 17, 17 : 5; యోహా 12 : 28) దహన బలిని
అర్పించునప్పుడు యాజకుడు యాగపశువును ముక్కలు
ముక్కలుగా చేసి, వాటిని బలిపీఠము మీద క్రమముగా
పెట్టెను. ( లేవీ 1 : 8, 9. ) ఆ క్రమ మేదనగా 1. తల
2. క్రొవ్వు 3. ఆంత్రములు 4. కాళ్ళు.

1. తల:—మన ప్రభువైన యేసుక్రీస్తుయొక్క మనస్సునకు యిది గురుతుగా నున్నది. (ఫిలి 2 : 5; మత్తై 11 : 29) యేసు ప్రభువుయొక్క మనస్సు పాపములేని మనస్సు. పరిశుద్ధమును నిష్కపటమునైన మనస్సుగా నున్నది. ఆయన దేవునిని సంతోషపరచు కార్యములను యెల్లప్పుడును చేసెను. (యోహా 8 : 29.) మనము దావీదువలె దేవా! నీ చిత్తమును నెరవేర్చుట నాకు నేర్పుము అని ప్రార్థింతుముగాక. (కీర్త 143 : 10) ఆయన మనకొరకు పాపముగా చేయబడినప్పటికిని మనస్సులో పాపములేనివాడుగా నుండెను. (II కొరింథీ 5 : 21) క్రీస్తు సంఘమునకు శిరస్సైయున్నాడు. (ఎఫె 5 : 22) ప్రభువు ఈ లోకములో తలదాల్చుకొనుటకైనను స్థలము లేని వాడుగా నుండెను. (లూకా 9 : 58; యోహా 8 : 1) అనాదికాలమునుండియు యేసు తన తండ్రి రొమ్మున ఆనుకొనుచునుండెను. (యోహా 1 : 2) ప్రభువు భూమిమీద ఉండినప్పుడు తలమీద ఉమ్మివేయబడి దుష్టుల

చేత కొట్టబడెను. నేడు పరలోకములో అనేక కిరీటములతో అలంకరించబడెను. (యెష 52 : 14; మత్తి 26 : 29; ప్రక 19 : 12)

2. క్రొవ్వు:—ఇది శరీరముయొక్క ఆరోగ్యమును బలమును సూచించుచున్నది. క్రొవ్వు అంతయు దేవునికి అర్పించబడెను. (లేవి 3 : 16; 7:25.) పరిపూర్ణ మానవుడుగా యేసు దేవునిని పూర్ణశక్తితో ప్రేమించెను. (మార్కు 12 : 30) క్రొవ్వు మన ప్రియరక్షకుడైన యేసుయొక్క వ్యక్తిగత రహస్య జీవితముయొక్కయు బాహాట జీవితము యొక్కయు శ్రేష్ఠతను సూచించుచున్నది. ప్రభువుయొక్క జీవిత రమ్యతను తండ్రి ఒక్కడు మాత్రమే యెరిగి ఆనందించుచున్నాడు. కనుక క్రొవ్వంతయు బలిపీఠము మీద అర్పించబడినది.

3. ఆంత్రములు:—ఇది పాపము లేని వాడైన యేసును సూచించుచున్నది. I యోహా 3 : 5; ఫిలి 4 : 8 లోని యోగ్యతలను, మెప్పులను సత్యమైన, మాన్యమైన, న్యాయమైన, పవిత్రమైన, రమ్యమైన, ఖ్యాతిగల వాటన్నిటిని యేసు స్వామి ప్రేమించుచున్నాడు. యేసు దివారాత్రములు దేవుని వాక్యమును ధ్యానించెను. (కీర్త 1 : 2; 119 : 97) దేవుని వాక్యముచేత యేసుప్రభువు పరీక్షించ బడినప్పుడు పాపము లేని పరిపూర్ణుడుగా కనుగొనబడెను. (యోహా 8 : 46.) ఆయన పాపము నెరుగనివాడు (I పేతు 2 : 22)

4. కాళ్ళు:—యేసుప్రభువుయొక్క నడతను సూచించుచున్నవి. మనవలె ఆయన యెన్నడును తప్పిపోలేదు (యెష. 53 : 6). మనము దేవునియొక్క తప్పిపోయిన కుమారులము. యేసు అయితే విధేయుడైన కుమారుడు. ఆయన యెప్పుడును అక్రమము చేయలేదు, గాని ఆయన అక్రమస్థులలో ఒకడుగా ఎంచబడెను (లూకా 23 : 37). కీర్త 147 : 10 వచనములో ఆయన నరుల కాళ్ళయందు ఆనందించడు అని వ్రాయబడియున్నది. పాత తర్జుమా కాని ఆయన ప్రియకుమారుడైన యేసుక్రీస్తు కాళ్ళయందు ఆయన సంతోషించెను. ఇదిగో ఈ మనుష్యుడు (యోహాను 19 : 5) ఆయన కాళ్ళు యెంత బలమైనవి (పరమ 5 : 15). చలువరాతి స్తంభములవలె నున్నవి. ఎంతో చక్కనివి (రోమా 10 : 15). యేసు తన తండ్రి మార్గమును అతిక్రమించలేదు. దానియందు నడిచెను (కీర్త 119 : 35; యోహా 8 : 29; లూకా 2 : 49). ఈ విధముగా దహనబలిలో మన ప్రభువైన యేసుక్రీస్తుయొక్క పరిపూర్ణతను, దానియందు దేవుడు ఆనందించుటయును చూడగలము. దేవుని ఆనందముకొరకును, తృప్తికొరకును బలిపీఠముమీద అంతయు అర్పించబడెను.



# 2. నైవేద్యము

దహనబలిలో యేసు నీ దేవుడైన ప్రభువును నీ పూర్ణ హృదయముతోను, నీ పూర్ణాత్మతోను, నీ పూర్ణ వివేకముతోను, నీ పూర్ణ బలముతోను ప్రేమించవలెను, అను దేవుని యొక్క మొదటిదియును గొప్పదియును అయిన ఆజ్ఞను నెరవేర్చిన వాడుగా కనిపించుచున్నాడు. మరియు నైవేద్యములో యేసు నిన్నువలె నీ పొరుగువానిని ప్రేమించవలెను అను దేవునియొక్క రెండవ ఆజ్ఞను నెరవేర్చినవాడుగా కనుపించుచున్నాడు (మార్కు 12 : 32—33). వీనిలో మొదటి యాజ్ఞ దేవుని యెడల మానవుని కర్తవ్యమును, రెండవ యాజ్ఞ మానవులయెడల మన కర్తవ్యమును చూపించుచున్నవి. వీటికంటె ముఖ్యమైన యాజ్ఞ మరి యేదియు లేదని యేసుప్రభువు చెప్పెను. దేవునిని పూర్ణహృదయముతో ప్రేమించి, మానవులను తనవలె ప్రేమించినవాడు యేసుప్రభువు ఒక్కడు మాత్రమే.

నైవేద్యము నిజమైన కానుకయైన యర్పణయైయున్నది. అని పాత తర్జుమాలో వ్రాయబడియున్నది. నైవేద్యములో రక్తము కనిపించదు అనగా జీవము అర్పించబడని అర్పణ అని అర్థము. ఇది మెత్తనిపిండితో కూడినదై యున్నది. దీనికి యింక యితరములైన దినుసులుకూడ చేర్చబడినవి. ఇది రెండు విధములుగా దేవునికి అర్పించబడెను. ఆ రెండువిధము లేవనగా, 1. ముడిపదార్థముగాను, 2. అప్పడములుగాను.

నైవేద్యములో పాపప్రాయశ్చిత్తము అను మాట కనుపించదు (లేవీ 1 : 4). ఎందుకనగా, దహనబలి దేవునిని సమీపించు పాపికి చెందియున్నది. నైవేద్యములో రక్తము లేదు. నైవేద్యమును దహనబలితో పోల్చి చూచిన యెడల తారతమ్యములను కనుగొనగలము.

| దహనబలి | నైవేద్యము |
|---|---|
| ముఖ్యలక్షణము — అగ్ని. | ముఖ్యలక్షణము — నూనె. |
| సారాంశము — భక్తి. | సారాంశము — పరిశుద్ధత. |
| రక్తముచిందింపబడెను. | రక్తము చిందింపబడలేదు. |
| పాపప్రాయశ్చిత్తముకలుగును. | పాపప్రాయశ్చిత్తము కానిది. |
| భాగమంతయు దేవునికి చెందినది. | కొంతమట్టుకు యాజకునికి చెందినది. |
| పూర్తిగా దహింపబడెను. | జ్ఞాపకార్థముగా దహింపబడెను. |

నైవేద్యము ఎన్నడును ఒంటరిగా అర్పించబడలేదు.

ఎందుకనగా నైవేద్యము యేసుప్రభువుయొక్క మచ్చ లేని నిర్దోష జీవితమును చూపించుచున్నది. క్రీస్తు మరణము కానియెడల మనలను రక్షించనేరదు. నైవేద్యము సాధారణముగా దహనబలితో జతగాఅర్పించబడెను (నిర్గమ 29 : 38–42; లేవీ 9 : 16; 14 : 30; 23 : 18). కొన్ని సమయముల యందు నైవేద్యము సమాధానబలితో జతగా అర్పించబడినది. ఈ సంగతులను బహుజాగ్రత్తగా ఆలోచించవలెను. ఎందుకనగా రక్తము చిందింపకుండ పాపక్షమాపణ కలుగనేరదు

(హెబ్రీ 9 : 22). కయీను చేసిన తప్పితము లేక పాపము [illegible] దహనబలితో జతపరచబడని నైవేద్యము నర్పించుటచే అతడు అర్పించిన యర్పణలో రక్తము చిందింపబడలేదు గాన తృణీకరించబడెను. యీ సందర్భములో హెబ్రీ 11 : 4ను బహు జాగ్రత్తగా చదువవలెను. విశ్వాసమును బట్టి హేబెలు కయీను కంటె శ్రేష్ఠమైన బలి దేవునికి అర్పించెను. దేవుడతని అర్పణలను గూర్చి సాక్ష్యమిచ్చినప్పుడు అతడు ఆ విశ్వాసమునుబట్టి నీతిమంతుడని సాక్ష్యము పొందెను. అర్పణ అన లేదు గాని, అర్పణలను అర్పించెను అని బహువచనమును దేవుడు వ్రాయించెను. అనగా హేబెలు దహనబలిని, నైవేద్యమునుకూడ అర్పించెను అని తేటయైనది. అందువలన హేబెలు అంగీకరించబడెను. కయీను తృణీకరించబడెను. పాపులమైన మనము దేవుని సమీపించుటకు ముందుగా రక్తము చిందింపవలెను. దహనబలిలో యేసును సంపూర్ణ పాపప్రాయశ్చిత్తము చేసినవానినిగా చూతుము. నైవేద్యములో యేసును సంపూర్ణ నిర్దోషియైన జీవముగలిగి పాపములేని రక్షకునిగా చూతుము. మనలను దేవుని సన్నిధిలోనికి ప్రవేశింపజేయు దహనబలి యేసుప్రభువే. సన్నిధిలో ప్రవేశించినతరువాత మాత్రమే నైవేద్యమునుఅర్పించగలము. దేవునియొక్క వరుసచూడగా దహనబలి, తరువాత నైవేద్యము కనిపించును. (సంఖ్యా 28 : 31)

జ్ఞాపకార్థము అనేమాట నైవేద్యములో 4 సార్లు కనిపించుచున్నది (లేవీ 2 : 2; 2 : 9; 2 : 16; 6 : 15). కొద్ది

భాగము మాత్రమే జ్ఞాపకార్థముగా బలిపీఠముమీద దహించ బడినది. మిగిలినది అహరోనుకును, అతని కుమారులకును యివ్వబడెను (లేవి 2 : 9; 6 : 15). ఇక్కడ దేవుడు ఆయన యొక్క విశ్వాసులైన యాజకులు (I పేతురు 2 : 5) యేసు క్రీస్తు యొక్క సంపూర్ణతలో ఆనందించుటను చూచు చున్నాము. ఆయన ప్రియకుమారునియందు ఆయన ప్రజలు కూడ సంతోషింపవలెనని దేవుడు కోరుచున్నాడు.

ప్రభువైన యేసుక్రీస్తుయొక్క బల్లయైన ఆరాధనబల్ల చుట్టు మనము చేరినప్పుడు ప్రభువును జ్ఞాపకము చేసి కొందుము. తండ్రియైన దేవుడుకూడ కుమారుడైన యేసు క్రీస్తువలన కలుగు యీ సంతోషములో పాల్గొనుచున్నాడు.

## నైవేద్యముయొక్క దినుసులు.

**1. మెత్తని పిండి :—** ఇది నైవేద్యముయొక్క ముఖ్యమైన దినుసు. అబ్రహాము పరసంబంధమైన ఆ ముగ్గురు వ్యక్తులను తన యింట చేర్చుకొనినప్పుడు మెత్తని పిండిని వారికొరకుపయోగించెను (ఆది 18 : 6). మూడు మానికలు అనుమాట దైవ సంపూర్ణతను తెలియ జేయుచున్నది (కొలొ 2 : 9). గోధుమలు నలుగ గొట్టబడెను. (యెష 28 : 28) యేసుప్రభువు మనకు జీవాహారమగుటకు సిలువలో నలుగ గొట్టబడెను (యెష 53 : 5). యేసుస్వామి మూడు విధములుగా నలుగ గొట్టబడెను. (౧) మనుష్యుల

వలన (యోహా 19 : 1) (బి) సాతానువలన (ఆది 3 : 15) (సి) దేవుని వలన (యెష 53 : 10) మెత్తని పిండి ప్రియరక్షకుడైన యేసు క్రీస్తుయొక్క పవిత్రమైన జీవితమునకు గురుతుగా నున్నది. మెత్తని పిండిలో నలుసులు లేవు. కేవలము మెత్తగా నుండును. క్రైస్తవ భక్త శ్రేష్ఠులలో సహా నలుసులు కనిపించును. అబ్రాహాము దేవుని స్నేహితుడని పరిశుద్ధ గ్రంథములో మూడుసార్లు వ్రాయబడియున్నది (II దినవృ 20 : 7 ; యెష 41 : 8 ; యాకోబు 2 : 23). కాని అతనుకూడ నలుసులు కలిగియున్నాడు, బొంకెను. (ఆది 12 : 18-19; 20 : 2) మోషే దేవునిని ముఖాముఖిగా చూచెను. (ద్వితీ 34 : 10) గాని, అతడును నలుసులు కలిగియున్నాడు. కానిమాట పలికెను. (సంఖ్యా 20 : 10-12) దేవుని కవిధేయుడై వాగ్దాన దేశములో ప్రవేశించలేదు. దావీదు దేవుని కిష్టుడైన మనుష్యుడు (అపో. కార్య 13 : 22). అయినప్పటికిని ఘోరపాపము చేసియున్నాడు II సమూ 11 వ. అధ్యాయమంత. ఈ భక్తుల జీవితములో నలుసులు కనిపించెను. గాన మెత్తని పిండియని చెప్పలేము. అయితే యేసుప్రభువు యొక్క జీవితములో నలుసులు యేమియు లేవు యోహా 8 : 46; హెబ్రీ 7 : 26 గాన మెత్తని పిండియని చెప్పగలము. నైవేద్యము యేసుప్రభువు యొక్క నిర్దోష జీవితమును చూపించుచున్నది. అందువలన నైవేద్యము అతి పరిశుద్ధమైనది అని వ్రాయబడెను (లేవీ 2 :3; 2 : 10 ; 6 : 17; 10 : 12).

2. నూనె :— ఇది నైవేద్యదినములలో రెండవది : నూనె పరిశుద్ధాత్మకు సాదృశ్యముగానున్నది. లూకా 4 : 18; అపొ. కార్య 10 : 38 ఈ వచనములలోను, మరికొన్ని యితర వస్తువులలోను నూనెయును మెత్తని పిండియును కలుపబడినట్లు చూచుచున్నాము. లేవి 2 : 1, 4, 15 వచనములను జాగ్రత్తగా గమనించుము. ఈ వచనములయొక్క భావముకొరకు క్రొత్త నిబంధనను పరిశీలింతము.

1. యేసుక్రీస్తు పరిశుద్ధాత్మవలన పుట్టెను — మత్తయి 1 : 20; లూకా 1 : 25.

2. ఆయన ఆత్మవలన అభిషేకించబడెను — లూకా 4 : 18; అపొ. కార్య 10 : 38.

3. ఆయన ఆత్మవలన నడిపించబడెను — లూకా 4 : 1; 4 : 14.

4. ఆయన ఆత్మతో నింపబడెను — లూకా 4 : 1.

5. ఆయన ఆత్మవలన సూచక క్రియలను చేసెను — మత్తయి 12 : 28.

6. నిత్యుడగు ఆత్మద్వారా తన్ను తాను దేవునికి నిర్దోషినిగా అర్పించుకొనెను (హెబ్రీ 9 : 14). ఈ సంగతులను చూడగా నూనెయైన పరిశుద్ధాత్ముడును మెత్తని పిండియైన యేసును కలిసినట్లు అనగా నూనెయు మెత్తని పిండియు కలిసినట్లు గోచరించుచున్నది. యేసు ఒక్కడు మాత్రమే ఆనంద తైలముతో అభిషేకించబడినాడు (హెబ్రీ 1 : 9). దేవుడు

ఆయనకు కొలతలేకుండ ఆత్మను అనుగ్రహించెను (యోహా 3 : 33–34). ఆయన నామమును ధరించుకొనిన మనము పరిశుద్ధాత్మకు ఆలయమై యున్నాము (I కొరిం 6 : 19). మనము ఆత్మపూర్ణులమై యుండవలెను (ఎఫె 5 : 18). ఆలాగైతే యేసుక్రీస్తువలన విజయకరమైన బ్రతుకు బ్రతుకగలము. ప్రియ చదువరీ! అటువంటి బ్రతుకును నీవు బ్రతుకుచున్నావా ?

3. సాంబ్రాణి :— నైవేద్యముయొక్క దినుసులలో సాంబ్రాణి మూడవది (లేవీ 2 : 1). నైవేద్యము నర్పించువారు ముడిపిండిని అర్పించునప్పుడు ఈ పిండితో సాంబ్రాణియు నర్పించెను. ప్రథమఫలముల నైవేద్యము నర్పించునప్పుడు సాంబ్రాణియు కనబడును (లేవీ 2 : 14, 15). పులియని అప్పడములతో ఇది అర్పించబడలేదు. సాంబ్రాణి అంతా దేవునికే అర్పించవలెను. అది సువాసనయిచ్చునట్లు అగ్నిమీద పోయబడవలెను. యేసు రక్షకునియొక్క సిలువ మరణముయొక్క సువాసనను తండ్రి యొక్కడుమాత్రమే పూర్తిగా యెరిగి యానందించగలడు. ఆ మరణము మానవులకు గొప్ప ఆశీర్వాదమును తెచ్చెను. ఆ ఆశీర్వాదమును గూర్చి మనము కొంచెముమాత్రమే యెంచుచున్నాము. యేసుప్రభువునిగూర్చి దేవునికున్న పూర్ణఉద్దేశమేమి ? నరుల కంటె నీవు అతిసుందరుడవు. (కీర్తన 45 : 2). ఆయన అతి కాంక్షనీయుడు (పరమ 5 : 16) జ్ఞానులు బాలుడైన యేసును చూడవచ్చినప్పుడు సాంబ్రాణిని అర్పించిరి. (మత్త 2 :11).

ఇది యేమి చూపించుచున్నదనగా క్రీస్తుదేహములోని ఆ శిశువు పవిత్రుడును, దేవునియొక్క సద్గోషియు, దేవునికి మిక్కిలి ప్రియుడును అని చూపించుచున్నది.

4. ఉప్పు :— ప్రతి అర్పణలోను ఉప్పు తప్పక యుండవలెను. (లేవీ 2 : 13) ఉప్పు చాల ముఖ్యమైన సంగతు లనుగూర్చి వివరించుచున్నది.

(1) రుచి–యోబు 6 : 6; మత్తయి 5:13; కొలొస్సై 4 : 6.

(2) చెడిపోకుండచేయును—II రాజులు 2 : 19—22.

(3) విశ్వాస్యత – లేవీ 2 : 13; సంఖ్యా 18 : 19; II దినవృ 13 : 5; యెహెజ్కే 43 : 24. యేసుప్రభువుయొక్క యీ లోకజీవితము దేవునికి మిక్కిలి రుచికరమైనదిగా ఉండెను. క్రీస్తు జీవితములో సంపూర్ణ మానవత్వము అనే మెత్తని పిండియు, పరిశుద్ధాత్మశక్తియను నూనెయును; సువాసనకరమైన పవిత్ర ప్రవర్తనయనే సాంబ్రాణియు; నిర్దోషత్వమను ఉప్పుయును, కనిపించుచున్నవి. మనము దినదినము ఆయనతో సహవాసము కలిగియుండినయెడల ఈ నాలుగు దివ్యలక్షణములను మన జీవితములోను కలిగియుండగలము. I పేతురు 2 : 9.

## నైవేద్యములో నిషేధించబడిన వస్తువులు

నైవేద్యమునుగూర్చి జాగ్రత్తగా చదివినయెడల రెండు వస్తువులు నిషేధించబడినట్లు కనబడును. అవి యేవనగా పులుపు.

తేనె. [illegible], నూనె, సాంబ్రాణి, ఉప్పు ఇవి మన ప్రియ రక్షకుడైన యేసుక్రీస్తుయొక్క గుణాతిశయములను చూపించు చున్నవి. పులుపు, తేనె, ఆయన గుణాతిశయములను చూపించ [illegible].

I **పులుపు :—** దేవుని వాక్యములో పులుపు దుష్టత్వమునకు గుర్తుగా నున్నది. పులుపు అనుమాట బైబిలులో ఆది 19 : 1—3 లో మొదటగా కనిపించుచున్నది. ఈ వచనములనుబట్టి మనము చెప్పుకొనునది యేమనగా సొదొమలో వారు సాధారణముగా ఉపయోగించునది పులిసి పొంగిన రొట్టెలు, పరసంబంధమైన ఆ ముగ్గురు అతిథులకు అబ్రాహాము యిచ్చిన రొట్టెనుగూర్చి "పొంగని" అనేమాట వ్రాయబడలేదు. ఎందుకనగా పొంగని దానిని అబ్రాహాము యొక్క యింటిలో వాడరు. (ఆది 18 : 6) పులుపిండినిగూర్చి నిర్గ 12 : 15 లో రెండవసారిగా వ్రాయబడినది. దీనిని బట్టి చూడగా ఐగుప్తులో పొంగిన రొట్టె సాధారణముగా ఉపయోగించబడెను. ఇది సరియైతే ఐగుప్తులోను సొదొమలోను పులిసి పొంగిన రొట్టెలనుపయోగించిరి. ప్రక 11 : 8 లో చెప్పబడినట్లు సొదొమ ఐగుప్తు యొక్క దుర్మార్గగుణములను కలిగి యుండెను.

(1) పులుపు :— దుర్బోధకు గుర్తుగా నున్నది. (మత్త 13 : 33; 16 : 12; మార్కు 8 : 15) పరిసయ్యుల యొక్క పులిపిండి వట్టి మతాచారమును వేషధారణను మాత్రము కలిగియుండుట. (మత్త 23 : 14, 16, 23, 28).

(2) పునరుత్థానమును నమ్మకపోవుట సద్దూకయ్యుల పులిపిండి (మత్త 22 : 23 — 29; అపో. కార్య 23 : 8)

(3) రాజకీయ ఘనతను కోరుట హేరోదీయులయొక్క పులిపిండి. (మార్కు 3 : 6; మత్త 28 : 15 — 16; మార్కు 12 : 13)

(4) I కొరింథీ 5 : 7 దుష్టత్వమును, దుర్మార్గతయును పులిపిండి.

(5) ధర్మశాస్త్రమును ఆచరించుటయను దాస్యపుకాడి క్రింద నుండుట. (గలతీ 5 : 1 — 9)

నైవేద్యములో పులిపిండి యేమియు లేదని మరచిపోవద్దు అనగా యేసుక్రీస్తునందు హానికరమైన దేదియు లేదనియు ఆయన కేవలము పవిత్రుడనియు అర్థము. (హెబ్రీ 7 : 26)

II తేనె:— ఇది నైవేద్యములో నిషేధింపబడినది. తేనె తీపైన వస్తువు అయినప్పటికిని కాల్చబడినప్పుడు పొంగి పులుపుగా మారును. సాంబ్రాణి అగ్నిమీద వేయబడగానే సువాసన నిచ్చును. తేనె మనుష్యుని యొక్క తప్పిన జీవితము యొక్క మాధుర్యమునకు గుర్తుగానున్నది. క్రైస్తవుడు గాని అన్యుడుగాని ప్రతివానియొక్క తప్పుడుజీవితము రుచిగానే యుండును. తేనె మానవునియొక్క ప్రాముఖ్యతకు గుర్తు. మేమందరమును అపవిత్రులవంటివారమైతిమి, మా నీతి క్రియలన్నియు మురికిగుడ్డలవలె నాయెను. (యెష 64 : 6; ఫిలిప్పీ 3 : 4-11) మన ప్రియరక్షకుడైన యేసుప్రభువు సిలువలో

దేవుని కోపాగ్నియందు దహించబడినప్పుడు, దేవునికి ప్రీతికరమైన యాగముగానుండి, మరి పవిత్రముగా కనిపించెను.

## నైవేద్యములోని రకములు

**I వట్టి మెత్తనిపిండిది** (లేవీ 2 : 1–3). నైవేద్యములోని మొదటిరకము మెత్తనిపిండిది. దానిమీద నూనె పోయబడెను, సాంబ్రాణియును ఉప్పును దీనితో చేర్చబడెను. దీనిలో ఒకభాగము బలిపీఠముమీద దహించబడెను. మిగిలినది యాజకునికి యివ్వబడెను. ఈ విధమైన నైవేద్యములో యేసుక్రీస్తుయొక్క జీవితములోని పవిత్రత అంతయు సుగుణ సంపత్తిని కనుగొనగలము. ఈ నైవేద్యములో యేసుక్రీస్తుయొక్క శక్తి, పవిత్రత, ప్రేమాతిశయములు కనిపించుచున్నవి.

**II పొయ్యిలో కాల్చబడిన నైవేద్యము**(లేవీ2 : 4–10). ఈ విధమైన నైవేద్యము నూనె కలిసిన పొంగని అప్పడములు లేక పూరీలు గలదిగానున్నది, వీటికి ఉప్పు చేర్చబడినది. ఈ విధమైన నైవేద్యమునకు సాంబ్రాణి చేర్చబడలేదు. అర్పణ నర్పించువాడు యేసుక్రీస్తుయొక్క పవిత్రమైన మచ్చలేని జీవితమును, మొదటి నైవేద్యములో కనుగొనినంతగా ఈ నైవేద్యములో కనుగొనలేడు. అయినప్పటికిని ఈ నైవేద్యముకూడ దేవునివలన అంగీకరించబడినదాయెను. మనము యేసుక్రీస్తునందు ఆనందించుట తక్కువగా ఉండినదైనప్పటికిని దేవుడు దానిని కూడ స్వీకరించుచున్నాడు.

### III ప్రథమఫలముల నైవేద్యము (లేవీ 2 : 14–16).

ప్రథమఫలముల నర్పించు నైవేద్యము మూడవవిధమైన నైవేద్యము. ఇది పచ్చని వెన్నులతో కూడినదైయున్నది. దేవునిచేత ఏర్పరచబడినవారిమీద నేరముమోపువాడు ఎవడు? నీతి మంతులుగా తీర్చువాడు దేవుడే. శిక్ష విధించువాడెవడు? చనిపోయినవాడు క్రీస్తుయేసే. అంతేకాదు. మృతులలోనుండి లేచినవాడు ఆయనే. ఆయన దేవుని కుడిపార్శ్వమున ఉన్న వాడై మనకొరకు విజ్ఞాపనము కూడ చేయుచున్నాడు. (రోమా 8 : 33–34) ఈ విధమైన నైవేద్యము నర్పించువాడు దేవుని యొద్దకు చేరుటకు యీ విధముగానున్నది. ఈ నైవేద్యము మృతులలోనుండి ప్రథమఫలముగా లేచిన క్రీస్తును (I కొరింథీ 15 : 20) మృతులలోనుండి ఆదిసంభూతుడుగా లేచినవాడు నైన యేసును ప్రకటన 1 : 5 చూపించుచున్నది. ఆయన శ్రమలను గూర్చిన పూర్తియైన జ్ఞాపకము మనము దీనియందు కలిగియుంటున్నాము. కారణము యేమనగా పచ్చని వెన్నుల లోని ఊచబియ్యమును వేయించి విసిరి అర్పించిరి. (లేవీ 2 : 14) ఇది పచ్చని వెన్నైయె యున్నప్పుడు యేలాగు కోయ బడినదో, ఆలాగే క్రీస్తు యౌవ్వనకాలములో సజీవుల భూమి లోనుండి కొట్టివేయబడెను. (యెషయా 53 : 8) ఈ నైవేద్యము నకు సాంబ్రాణియును, ఉప్పున్ను చేర్చబడినవి, అనగా ప్రభువు తండ్రిని ఈలోకములో ఉండినప్పుడు సంతోషపెట్టుటమాత్రమే కాక చనిపోయి తిరిగిలేచి తండ్రికి నిత్యసంతోషమును కలి గించుచున్నాడు.

## నైవేద్యము ఏవిధముగా తయారుచేయబడినది?

నైవేద్యము మూడువిధములుగా తయారుచేయబడినది.

I. పెనముమీద కాల్చబడిన నైవేద్యము (లేవి 2 : 5) మనుష్యులు చూచి గ్రహించగలిగిన శ్రమలకు ఇది సూచనగా యున్నది. (మార్కు 14 : 65; 15 : 16–19; మత్త 26 : 67; 27 : 29) ఇవి మానవ గ్రహింపునకు అందుబాటులోనున్న క్రీస్తు శ్రమలు.

II. పొయ్యిలో కుండయందు కాల్చబడినది. (లేవి 2 : 7) రహస్యమైన క్రీస్తుయొక్క శ్రమలకు ఇది గురుతుగా యున్నది. ఈ శ్రమలను మనుష్యుడు గ్రహించ నేరడు. (మార్కు 10 : 38; లూకా 12 : 50; 22 : 41–44; యోహా 12 : 23–28; హెబ్రీ 2 : 18) "నా దేవా, నా దేవా నన్నెందుకు చేయి విడచితివి" కీర్తన 22 : 1 అని ప్రభువు కేక వేసినప్పుడు పొందిన శ్రమలను యెవడు వర్ణించగలడు?

III. వేయించి విసిరిన ప్రథమఫలముల నైవేద్యము. (లేవి 2 : 14) ఇది దీర్ఘకాలము క్రీస్తుపొందిన శ్రమలకు గుర్తుగానున్నది. (కీర్తన 22 : 1 – 2, 5) ప్రభువు యొక్క యావత్తు జీవితము శ్రమలతో కూడినదై యున్నది. (లూకా 9 : 22, 44, 45, 51; లూకా 20 : 13–15; 22 : 41–44) తాను పొందనైయున్న శ్రమలన్నిటిని ప్రభువు మొదటి నుండియు యెరిగియున్నవాడే. ఆహా! ప్రభువు బ్రతికిన బ్రతుకు

మెంత విచిత్రమైనది. గనుక మనము ఆయన ననుసరించి, ఆయనయొక్క అడుగుజాడలలో నడుచుకొందము. (I పేతురు 2 : 21)

# 3. సమాధాన బలి

యేసుక్రీస్తు సిలువరక్తముచేత మనలను తండ్రియైన దేవునితో సమాధానపరచి యున్నాడు. గనుక ఆయనే మన సమాధాన కారకుడై యున్నాడు అను సత్యము యీ సమాధాన బలియందు కనిపించుచున్నది. (కొలొ 1 : 20; ఎఫె 2 : 16) యేసుస్వామి సిలువలో మరణించుట మూలముగా తనయందు విశ్వాసముంచువారిని దేవుని సమాధానము కలిగిన వారినిగా చేయుచున్నాడు. (రోమా 5 : 1) సమాధాన బలి సంతోషముతో అన్యోన్యత కలిగియున్నది. (I సమూ 11 : 15; II సమూ 6 : 15-18; I రాజు 8 : 63-66; ద్వితీ 27 : 7) సమాధానబలి సహవాసమునకు గుర్తుగానున్నది. సంతోష సమాధానములు ఒకదానితో నొకటి అన్యోన్యత కలిగి యున్నవి. (కీర్త 16 : 11; సంఖ్యా 10 : 10; కీర్త 4 : 7.) సమాధానబలి యితర బలులనుండి వేరుగా నున్నది. ఎందుకనగా దీనియందు (1) దేవుడు (2) యాజకుడు (3) అర్పణను అర్పించు వ్యక్తి ఒక్కొక్క భాగమును పొందియున్నారు. (లేవి 7 : 14, 16; 3 : 10-11) ఇది సువాసనకరమైన బలి.

దేవుడు దీనియందు సంతోషించుచున్నాడు. దీనియొక్క సారాంశము సహవాసము. బలి నర్పించువాడు బలి పశువును గుడారముయొక్క ద్వారమునొద్దకు తీసుకొనివచ్చి దాని తలమీద చేతులుంచి, తానే దానిని వధించవలెను. లేవీ 3 : 1, 2, 8, 13. ఇది రోమా 4 : 25 లోని సత్యమును బోధించుచున్నది. అనగా క్రీస్తు మన అపరాధములకొరకు మృతిపొంది, మనము నీతిమంతులముగా తీర్చబడుటకు తిరిగి లేచెను. క్రీస్తుయొక్క సిలువ మరణమే నిజమైన సమాధానబలియై యున్నది. ఒకప్పుడు మనము అపరాధములవలనను పాపములవలనను చనిపోయి దేవునికి దూరస్థులమై యుండి యిప్పుడు ఆయన సిలువ మరణమునుబట్టి సమాధానపరచబడి సమీపస్థులమై యున్నాము. (ఎఫె 2 : 13) సమాధానబలి నిమిత్తము మూడు విధములైన జంతువులు దేవునివలన అంగీకరించబడినవి. (1) ఎద్దు. లేవీ 3 : 1 – 5. (2) గొర్రె. లేవీ 3 : 6 – 11. (3) మేక. లేవీ 3 : 12–16.

దహనబలికొరకు మగవాటిని తీసుకొనిరావలెను. (లేవీ 1 : 3) సమాధానబలి నర్పించువాడు మగదానినిగాని ఆడుదానినిగాని తీసుకొనిరావచ్చును. (లేవీ 3 : 1, 6) మగది బలమైనదానికి గుర్తుగా నున్నది. (I కొరిం 16 : 13) ఆడుది బలహీనమైనదానికి గుర్తుగా నున్నది. (I పేతు 3 : 7) యేసుక్రీస్తు దేవునిశక్తియై యున్నాడు గాన ఆయనయందు యేవిధమైన బలహీనత లేనే లేదు. (I కొరిం 1 : 24) ఆడజంతువుకూడ

నిర్దోషమైనదై యుండవలెను. ఈపశుజంతువు యేసుక్రీస్తును గూర్చి మనము కలిగియున్న అసంపూర్ణమైన అనుభవమునకు గుర్తుగా నున్నది. ప్రభువునుగూర్చిన మన అసంపూర్ణ గ్రహింపును బట్టియు, జ్ఞానమునుబట్టియు సహా దేవుడు సంతోషించుచున్నాడు.

సమాధానబలి మూడురకములుగా అర్పించబడెను. అవియేవనగా-(ఎ) కృతజ్ఞతార్పణ. (లేవీ 7 : 11) (బి) మ్రొక్కుబడి. (లేవీ 7 : 16) (సి) స్వేచ్ఛార్పణ. (లేవీ 7 : 16) ఈ మూడు విధములైన అర్పణలనుబట్టి యేసుప్రభువు చేసిన పాపపరిహార కార్యమును మూడువిధములుగా గ్రహించగలము. ప్రభువుయొక్క మరణమును గూర్చిన అనుభవజ్ఞానమును కొంతమంది విశ్వాసులు మాత్రమే విశేషముగా కలిగి యుందురు. (ప్రక 11 : 1) దూత ఆలయమును మాత్రమేకాక ఆరాధించువారిని కూడ కొలత వేయవలెనని ఆజ్ఞాపించెను. (మూలభాషలో చదువుము) రోమా 3 : 23 లో దేవుడు రక్షణ లేనివారిని కొలిచినట్లు చూచుచున్నాము. ప్రక 11 : 1 లో దేవుడు విశ్వాసులను కొలుచుచున్నట్లు చూచుచున్నాము. ఆరాధికుడవైన నిన్నుగూర్చి దేవుని కొలత యేమి? పెద్దదియా? లేక చిన్నదియా?

1. కృతజ్ఞతార్పణయైన సమాధానబలి.(లేవీ7:11-15) వ్యక్తి తాను అనేకమైన ఆశీర్వాదములను దీవెనలను పొందియున్నందున కృతజ్ఞత కలిగినవాడై యీ యర్పణను

ప్రార్థించెను. దావీదు యిట్లనెను......"నీవు నా కట్లు విప్పి యున్నావు. నేను నీకు కృతజ్ఞతార్పణ నర్పించెదను" (కీర్త 116 : 16-17.) అనగా దావీదు తాను పొందిన ఆ మేలును బట్టి కృతజ్ఞతగా సమాధానబలి నర్పించెను. కీర్త 23 : 5; 56 : 1 లలో కూడ దావీదు తాను పొందిన దీవెనను బట్టి కృతజ్ఞత కలిగియున్నట్లు కనిపించుచున్నది. దహనబలియైతే పూర్తిగా బలిపీఠముమీద దహించబడియున్నది. సమాధాన బలియైతే మూడుభాగములుగా విభాగించబడియున్నది. ఒక భాగము దేవునిది. రెండవభాగము యాజకునిది. మూడవ భాగము అర్పణ నర్పించువానిది. అనగా మన సహవాసము తండ్రితోను కుమారునితోను విశ్వాసులతోను యున్నదని అర్థము. ఇదియే దేవునితోను యేసుప్రభువుతోను మనకుకలిగిన మూడంతల సహవాసము. పులిసినపిండితో చేయబడినరొట్టె కృతజ్ఞతార్పణమైన సమాధానబలితో యెందుకు అర్పించబడినది? (లేవీ 7 : 13) పులిసిన పిండితో చేయబడిన రొట్టె అపవిత్రమైనదానికి గుర్తుగానున్నది. యేసు ప్రభువులో మాత్రమే యేవిధమైన అపవిత్రత లేనేలేదు. ఆయన అతి పరిశుద్ధుడు. (హెబ్రీ 7 : 26) పులిసిన పిండితో చేయబడిన రొట్టె యెన్నడును ఒంటరిగా అర్పించబడలేదు అని మనము ముందుగా గమనించవలెను. రక్తముతో కూడిన సమాధాన బలితో జతగా ఇది అర్పించబడినది. ఇది కృతజ్ఞతార్పణతో అర్పించబడవచ్చును, గాని బలిపీఠము మీద దహించబడ

కూడను. (లేవీ 2 : 11) సమాధానబలి బలిపీఠము మీద దహించబడినందున ఇది దేవునికి అంగీకారముగా నున్నది. మనము చేయు ఆరాధనయందును చెల్లించు కృతజ్ఞతా స్తుతులయందును సహా పాపమున్నది. యేసుప్రభువునకు వేరుగా అవి యంగీకరించబడనేరవు. ఎందుకనగా ఆయనయే మనకొరకైన సమాధానబలియై యున్నాడు. కాబట్టి ఆయన ద్వారా మనము దేవునికి యెల్లప్పుడును స్తుతియాగము చేయుదము.

అనగా ఆయన నామమును ఒప్పుకొనుచు జిహ్వా ఫలము అర్పించుదము. క్రైస్తవుని యావజ్జీవితము దేవునికి కృతజ్ఞతాస్తుతులు చెల్లించేదిగా ఉండవలెను. మనము ప్రతి విషయమందును కృతజ్ఞతాస్తుతులు చెల్లించవలెను. (I థెస్స 5 : 18; ఫిలి 4 : 6; కొలొ 2 : 7; 4 : 2; ఎఫె 5 : 18–20) కృతజ్ఞతాస్తుతులను చెల్లించవలసిన భారముతో మనము ఆయనను సమీపించుదమా ? మన పెదవుల నుండి వచ్చు స్తుతులను, మన హృదయమునుండి వచ్చు కృతజ్ఞతా వందనములను వినవలెనని దేవుడు ఎంతో ఆశించుచున్నాడు. మనము దేవునికి చెల్లించుచున్న కృతజ్ఞతా వందనములలోను, స్తుతులలోను పాపము ఉన్నప్పటికిని – యేసుక్రీస్తు మన సమాధానబలియై యున్నందున ఆయన ద్వారా దేవుడు వీటిని అంగీకరించుచున్నాడు.

2. సమాధానబలి మ్రొక్కుబడి (అర్పణ) గా కూడ అర్పించబడినది. (లేవీ 7 : 16; 22 : 18 – 21) ఇది వ్యక్తి

ఏదో ఒక ప్రత్యేకమైన ఆశీర్వాదమును పొందినందున మ్రొక్కుకొనబడిన అర్పణ (I సమూ 1 : 21 – 28; కీర్త 61 : 5–8; 66 : 13–15). ఈ మ్రొక్కుబడిని బట్టి మనము గ్రహించుకొనునది యేమనగా దీనిని అర్పించువానికి దేవుడు ఏదో ఒక కృపాకార్యమును చేసెనని, అందువలన దీనిని అర్పించేవాని హృదయమునుండి యెక్కువ కృతజ్ఞతతో కూడిన భక్తి దేవునిమీదికి వచ్చుచున్నది. ఈ విధమైన మ్రొక్కుబడిని చేయుటకు యాకోబు బేతెలులో నిశ్చయించుకొనెను. (ఆది 28 : 20–22) గాని యిరువై సంవత్సరములు గతించిన తరువాత మీ మ్రొక్కుబడులను చెల్లించవలసినదని దేవుడే వారికి జ్ఞాపకము చేయవలసివచ్చెను. అంతవరకు యాకోబు అర్పించనేలేదు. (ఆది 31 : 1–12; 35 : 1–7) నీవు మ్రొక్కుకొనిన దానిని చెల్లించుము (ప్రసంగి 5 : 5). కీర్త 61 : 8 లో దినదినము నా మ్రొక్కుబడులను చెల్లించునట్లు నీ నామమును కీర్తించెదను అని చెప్పిన దావీదు వలె మనమును ఉందుముగాక. (సంఖ్యా 13 : 2) నీవు నీ దేవుడైన యెహోవాకు మ్రొక్కుకొనిన తరువాత ఆ మ్రొక్కుబడిని చెల్లించుటకు తడవు చేయకూడదు. నీ దేవుడైన యెహోవా తప్పక నీవలన దాని రాబట్టుకొనును. (ద్వితీ 23 : 21)

3. స్వేచ్ఛార్పణ :— స్వేచ్ఛార్పణగాకూడ నర్పించబడినది. (లేవీ 7 : 11) ఈ విధమైన సమాధాన బలి నర్పించునపుడు, క్రీస్తుయెడలి ప్రేమతో నిండిన హృదయము కలిగిన

వారమై దయనకు స్తుతులను, మహిమను అర్పించ బాధ్యు లమై యున్నాము. 45 వ. దావీదు కీర్తనలో దావీదుయొక్క అనుభవము యీలాంటిదై యున్నది. లేవీ 22 : 23 వచన ములో విచిత్రమైన ఆజ్ఞ వున్నది. ఈ యర్పణలో దోషము గల జంతువు అర్పించబడినది. అనగా అర్పణలో దోష మున్నది. ఇట్టి దోషముగల జంతువు దహనబలిగా నర్పించబడ కూడదు గాని సమాధానబలిగా నర్పించబడవచ్చును. ఈ విధ మైన అర్పణ నర్పించువాడు యేసుక్రీస్తుయొక్క సమస్తమైన గుణాతిశయములను పూర్తిగా గ్రహించలేనివాడని మనము నేర్చుకొనుచున్నాము. కొందరు క్రైస్తవులు యేసుక్రీస్తు యొక్క ప్రేమను మాత్రమే ధ్యానింతురు. గాని దానికంటె యేసు పాపమును యెంతగా ద్వేషించుచున్నాడో దీనిని వారు గ్రహించవలసి యున్నారు. దేవుని చిత్తమునకు సంపూర్ణ విధేయతను చూపించుట యెట్టిదో వారు గ్రహించలేదు. (ఫిలిప్పీ 2 : 8) యేసుక్రీస్తు యొక్క గుణాతిశయములను మనము పూర్తిగా గ్రహించలేనివారమైనప్పటికిని తండ్రియైన దేవుడు మన అసంపూర్ణ భక్తియందును క్రీస్తునుబట్టి ఆనం దించుచున్నాడు. మన ఆరాధనలోను, స్తుతివందనములలోను, పాపపుటొప్పుదలలోను సహా దోషమున్నప్పటికిని దయాళుడైన దేవుడు తన కుమారునియందు మనలను స్వీకరించుచున్నాడు. ఆహా! యిది యెంత వింతైన కృప! మనలను రక్షించి, తన రక్తముచేత మనలను సంపాదించుకొనిన యేసుక్రీస్తు

వానియొక్క సుగుణాతిశయములను తెలిసికొనుటకును ఆయనను బాగుగా యెరుగుటకును మనము దేవుని వాక్యమును చక్కగా చదివి ధ్యానించుకొనవలెను. (II పేతు 1 : 2 – 4) దేవుని వాక్యమునందు తెలియపరచబడిన అత్యధికములగు అమూల్యమైన వాగ్దానములను మనము అనుభవించవలెను. నా నోటి మాటలును నా హృదయ ధ్యానమును నీ దృష్టికి అంగీకారములగును గాక. (కీర్త 19 : 14) ఆయనను గూర్చిన నా ధ్యానము ఆయనకు యింపుగా నుండును గాక. (కీర్త 104 : 34) ఈ యనుభవము చాల గొప్ప ధన్యతను ఆత్మీయముగా కలిగించును. గాన యీ యనుభవములను ఆశించుము.

## సమాధానబలిలో పాలుపొందిన వ్యక్తులు

1. దేవుడు:— సమాధానబలిలోని క్రొవ్వు అంతా దేవునిదే. దహనబలియొక్క ముఖ్యలక్షణము అగ్ని. నైవేద్యముయొక్క ముఖ్యలక్షణము నూనె. సమాధానబలియొక్క ముఖ్యలక్షణము క్రొవ్వు (లేవి 3 : 3, 4, 9, 10, 14, 15, 16) అని తెలిసికొని యుంటిమి. క్రొవ్వు అర్పణయొక్క ముఖ్యమైన భాగమైయున్నది. క్రొవ్వు అంతా దేవునికి అర్పించబడవలెను (లేవి 3 : 16).

క్రొవ్వు :— యేసుక్రీస్తు యొక్క శ్రేష్ఠత్వమునకు గురుతుగా నున్నది. అంతరింద్రియములను కప్పు క్రొవ్వు అనగా యేసుక్రీస్తుయొక్క భావోద్రేకమునకు (లేక హృదయ

వేగమునకు) గురుతు. కీర్త 7 : 9; 16 : 7; 26 : 2; 73 : 21; సామె 23 : 16; యిర్మి 11 : 20 ఈ వచనములు మానవుని యొక్క హృదయ రహస్యములను గూర్చి చెప్పుచున్నవి. అంతరింద్రియము అనగా హృదయమునొక్క రహస్య ప్రేమకు గురుతుగా నున్నది. సమాధానబలియందలి క్రొవ్వునందు కుమారుని యెడల తండ్రికిగల పూర్ణప్రేమ కనబడుచున్నది. (మత్త 3 : 17; 17 : 5.) క్రొవ్వు యెహోవాకు హోమ రూపకమైన ఆహారము. (లేవీ 3 : 11, 16)

లేవీ 3 : 16; 7 : 22–27 వచనములలో దేవుని ప్రజలు క్రొవ్వుగాని రక్తముగాని తినకూడదని ఆజ్ఞాపించబడెను. ఎందుకు వారు రక్తము తినకూడదూ? లేవీ 17 : 11 లో జవాబున్నది. రక్తము దేహమునకు ప్రాణముగనుక జీవితము అమూల్యమైనదైతే రక్తము అమూల్యమైనదిగా నుండును. యేసుక్రీస్తుయొక్క జీవితము అందరి జీవితముకంటె అమూల్యమైనదిగాన ఆయన రక్తము అమూల్యమైనది (I పేతు 1 : 19). యేసుక్రీస్తు జీవితములోని అమూల్యతను తండ్రియైన దేవుడు మాత్రమే పూర్తిగా యెరుగును.

బైబిలులో రక్తము చిందించుట యను మాట ఆది 3 : 21 లో మొదటిసారిగా చూచుచున్నాము. ఆదాము హవ్వలకు దుస్తులు కావలెనంటే యీ జంతువులు వధింపబడవలెను. హేబెలు వలన అర్పించబడిన గొఱ్ఱె. (ఆది 4 : 4.) పొదలో కొమ్ములు తగులుకొనియున్న పొట్టేలు (ఆది 22 : 13)

లోక పాపమును మోసికొని పోవు దేవుని గొఱ్ఱె పిల్లకు సాదృశ్యముగా నున్నవి. (యోహా 1 : 29) రక్తము చిందింపకుండ పాపక్షమాపణ కలుగనేరదు. (హెబ్రీ 9 : 22) యేసుక్రీస్తు చిందించిన రక్తము వలన మనకు విమోచనము కలిగియున్నది. (ఎఫె 1 : 7; రోమా 5 : 9; కొలొ 1 : 20; I యోహా 1 : 7; హెబ్రీ 10 : 19 – 20; 13 : 12; ప్రక 12 : 11). యేసుక్రీస్తుయొక్క రక్తము యెంతో అమూల్యమైనది. (I పేతు 1 : 19) ఆ రక్తమునుగూర్చి పరలోకములో నిత్యము పాడుదుము. (ప్రక 1 : 5–6; 5 : 8; 9–14)

2. బలినర్పించువాడు :— లేవీ 7 : 15 – 21 వచనములలో సమాధానబలి నర్పించువ్యక్తి యేభాగమును పొందియున్నాడో కనిపించుచున్నది. బలి నర్పించువాని యొక్క భాగము బలిపశువుయొక్క మాంసము. ఇది యోహా 6:32–58 లో వున్న సంగతులను చూపించుచున్నది. ఆహా ఎంత దివ్యమైన భాగము బలి నర్పించువానికి గలదూ! దీనిని తినుటలో మనకు (ఎ) సహవాసము (యోహా 6 : 58) (బి) తృప్తి (యోహా 6 : 35) కలుగుచున్నవి. ప్రతి క్రైస్తవుడు దేవుడు తనకు అనుగ్రహించిన దానితో సంతృప్తికలిగి యుండవలెను. ఆయన మనకు ఆహారమును సంతృప్తిగా నిచ్చును. (యోబు 36 : 31) దేవునియొద్ద "రేషనింగు" పద్ధతి లేదు. మనము గమనించవలసిన మరియొక సంగతి యేమనగా, సమాధాన బలిగా తాను అర్పించు కృతజ్ఞత బలిపశువును అర్పించు

దినమే దాని మాంసమును తినవలెను. దానిలోనిది యేదియు మరునాటికి ఉంచుకొనరాదు. (లేవీ 7 : 15) మనము దేవునితో దినదినము సహవాసము కలిగియున్నట్లు యిక్కడ చూచుచున్నాము. క్రైస్తవుని ప్రతిదిన జీవితము సమాధాన బలి నర్పించేదిగాను — తృప్తికరమైన విందు నారగించేదిగాను ఉండవలెను. యేసుక్రీస్తు మన దినదిన సమాధానబలియై యున్నట్లు కనుగొందుముగాక! ఆయనతో సహవాసముకలిగి యుండిన యెడలనే ఆయనయందు పోషింపబడినవారముగా నుందుము. మనకు అనుభవము లేని ఆత్మీయమైన సంగతులను గూర్చి మనము యెన్నడును బోధించకూడదు. మనము మరి యొక సంగతిని గమనించవలెను. బలి నర్పించువాడు బలి పశువును తినకముందు తాను శుద్ధుడు కావలెను. (లేవీ 7 : 20) ప్రభువు నామమును ఒప్పుకొను ప్రతివాడును దుర్నీతి నుండి తొలగిపోవలెను. (II తిమొ 2 : 19) మనము దేవునితో సహవాసమును కోరిన యెడల వెలుగులో నడువవలసి యున్నాము. (I యోహా 1 : 6; I కొరిం 11 : 27 – 29) దేవునితో సహవాసము కలిగియుండుటకు అపవిత్రమైన దేనినైన మనము ముట్టకూడదు. (II కొరిం 6 : 14 – 7 : 1)

**3. యాజకుని భాగము :—** (లేవీ 7 : 29 – 35) అల్లాడింపబడు బోర యెహోవా సన్నిధిని అల్లాడింపబడు అర్పణగా అర్పించబడిన తరువాత యీ బోర యాజకునికి చెందును. బోర (లేక రొమ్ము) ప్రేమ లేక సానుభూతిని

ప్రకాశించుచున్నది. విశ్వాసి యాజకుడైన అపొస్తలుడైన యోహాను అల్లాడింపబడు బోర అనే ఆహారమును భుజించే వాడు. యోహాను సువార్తలో ఐదుసార్లు యోహాను యేసు చేత ప్రేమింపబడినశిష్యుడు అని వ్రాయబడియున్నది. (యోహా 13 : 23; 19 : 25–27; 20 : 1; 21 : 7; 21 : 20) యోహానుకు కాదుగాని పేతురుకు యేసుప్రభువు నీవు నన్ను ప్రేమించుచున్నావా అను ప్రశ్న వేసినారు. ఇట్టి బిరుదును మనమందరము పొందుదుముగాక. యోహాను చాల ముసలి వాడుగా నుండినప్పుడు యీ మాటలు వ్రాసియున్నాడు. “మన యెడల దేవునికివున్న ప్రేమను మనము యెరిగినవారమై దానిని నమ్ముకొనియున్నాము. దేవుడు ప్రేమస్వరూపియై యున్నాడు. ప్రేమయందు నిలిచియుండువాడు దేవునియందు నిలిచియున్నాడు.” (I యోహా 4 : 16) విశ్వాసియైన అపొస్తలుడైన పౌలుకూడ అల్లాడింపబడు బోరను ఆరగించి యున్నాడు. (రోమా 8 : 35; ఎఫె 3 : 17–19; II కొరిం 5 : 14) పౌలుయొక్క ఆత్మీయమైన అభివృద్ధికి తాను ఆత్మలో అనుభవించుచున్న యేసుయొక్క ప్రేమయే కారణము.

**సమాధానబలిపశువులోనుండి ప్రతిష్ఠార్పణముగా యాజ** కునికి కుడిజబ్బ నియ్యవలెను ( లేవీ 7 : 32, 34 ) జబ్బ – బలమునకు గురుతు. యేసుక్రీస్తు బలవంతుడైన దేవుడు. (యెష 9 : 6) ఆయన భుజముమీద రాజ్యభారముండును. ప్రతిష్ఠార్పితమైన జబ్బను మనము దినదినము అనుభవించుటవలన

మనము బలవంతులమై గొప్ప కార్యములను చేసెదము. తమ దేవుని యెరిగినవారు బలము కలిగి గొప్ప కార్యములను చేసెదరు. (దాని 11 : 32; ఫిలిప్పీ 4 : 13) యేసు తన మహాత్మ్యగల మాటచేత సమస్తమును నిర్వహించును. (హెబ్రీ 1 : 4) అపొస్తలుడైన పౌలు నిత్యము అల్లాడింపబడు బోరను- కుడిజబ్బను భుజించేవాడు గాన ఈ మాటలయొక్క భావమును చక్కగా వ్రాసెను. (ఎఫె 3 : 14–18) దేవుని ప్రేమను యెరుగుటకు మనలను దేవునియొక్క ఆత్మ బలపరచవలెను. నీ జీవితములో ప్రేమయును శక్తియును కాన్పించునా? అలాగు కానియెడల సమాధానబలిలోని నీ భాగమును తీసికొని ఆ బోరను జబ్బను భుజించి ప్రేమను శక్తిని పొందుము. అప్పుడు నీవు ప్రేమతో నింపబడి దేవునికొరకు గొప్ప కార్యములను చేతువు.

# 4. పాపపరిహారార్థబలి

“ కావున యేసుకూడ తన స్వరక్తముచేత ప్రజలను పరిశుద్ధపరచుటకై గవిని వెలుపట శ్రమపొందెను ” (హెబ్రీ 13 : 12). “ మనమాయనయందు దేవుని నీతియగునట్లు పాప మెరుగని ఆయనను మనకొరకు పాపముగా చేసెను ” (II కొరింథీ 5 : 21).

సువాసనలేని రెండు అర్పణలలో పాపపరిహారార్థ బలి మొదటిది. అపరాధ పరిహారార్థబలి రెండవది. యేసు పాప పరిహారార్థబలియొక్క నిజస్వరూపమై యున్నాడు. దీనిని రుజువుచేయు అనేక వచనములు క్రొత్త నిబంధనలో గలవు. (మత్త 20 : 28; రోమా 3 : 26; I కొరింథీ 1 : 30; II కొరింథీ 5 : 21; ఎఫెసీ 5 : 2; హెబ్రీ 10 : 14; I యోహా 2 : 2). ఈ వచనములను బహుజాగ్రత్తతో చదువవలెను. ఎందుకనగా అవి లోకరక్షకుడైన యేసును చూపించుచున్నవి. పాపపరిహారార్థ బలియొక్క ముఖ్యలక్షణము రక్తము. (లేవీ 4 : 5, 6, 7, 16, 17, 18, 25, 30, 34) రక్తము చిందించుట పాపక్షమాపణకు మూలాధారము. (లేవీ 4 : 20, 26, 31, 35; 5 : 10, 13) మనలో పాపమున్నందున పాపపరిహారార్థ బలి అవసరమాయెను. మూడంతల ఉద్దేశము యీ యర్పణలో గలదు. (1) పాప ప్రాయశ్చిత్తము (2) పాప క్షమాపణ (3) ప్రతిష్ఠత. ఈ మూడు సంగతులను వరుసగా ధ్యానింతము.

1. పాప ప్రాయశ్చిత్తము:—( లేవీ 4 : 20, 26, 31, 35; 5 : 6, 10, 13) సువాసనకరమైన అర్పణయను సందర్భములో ప్రాయశ్చిత్తము అనేమాట ఒక్కసారి మాత్రమే వాడబడినది. పాపపరిహారార్థ బలిలోనైతే యేడుసార్లు వాడబడినది. దీనికి కారణము తేటగానున్నది. దహనబలి, నైవేద్యము, సమాధానబలి, యివి యింపైన సువాసనగల బలులు. వీనిలో ప్రతిబలియు దేవుని హృదయమును సంతోష

పరిచినవి. ఈ మూడు బలులు సంపూర్ణ మానవత్వము కలి
గిన యేసు అనగా యెవనియందు తండ్రియైన దేవుడు ఆనం
దించుచున్నాడో ఆ యేసుకు గురుతుగా నున్నవి. పాపపరి
హారార్థబలిలో ప్రాయశ్చిత్తముఅనేది ప్రాముఖ్యమైయున్నది.
తెలుగులోనికి తర్జుమా చేయబడిన ప్రాయశ్చిత్తము అనే
మాటకు సరియైన హెబ్రీ పదము "కప్పివేయుట" ఆదాము
హవ్వలు పాపముచేసినప్పుడు తమ దిగంబరత్వమును అంజూ
రపు ఆకులతో కప్పుకొనుటకు ప్రయత్నిముచేసిరి. అది దిగంబ
రత్వమును కప్పుటకు చాలదు. గాన దేవుడు నిర్దోషమైన
జంతువులను వధించి వాటి చర్మములతో వారిని తగిన విధ
ముగా కప్పెను. (ఆది 3 : 21) నీవును నేనును ఆయనయందు
దేవుని నీతియగునట్లు దేవుడు యేసును అదేవిధముగా సిలు
వలో వధించెను. పాప పరిహారార్థబలి దేవునిచేత నానాపాప
ముల పరిహారార్థము యివ్వబడినది. ఈ పాపములు లేవీ
4 : 2; 5 : 1–5 అధ్యాయములలో వర్ణించబడియున్నవి.
అవిధమైన పాపములు నాలుగు.

(ఎ) విధేయతలో తప్పుట:- (లేవీ 4:2, 13, 22, 27)
మానవ జీవితములో విధేయత మిక్కిలి అవసరమైన గుణము.
అవిధేయతవలననే మానవజాతి యావత్తు పాపులైయున్నారు.
(రోమా 5 : 19) మనము యెరిగిచేసిన వాటికొరకును యెరు
గక చేసిన వాటికొరకును దేవునికి లెక్క అప్పగించ వలసిన
వారమైయున్నాము. ఈ విషయమును జ్ఞాపకములో నుంచు

కొనుట చాలా ప్రాముఖ్యము. పాపమును గూర్చి దేవునికి ఇష్టమైనట్లు లేము. గనుక దేవుని చిత్తమును సంపూర్ణముగా నెరుగుట ప్రతి క్రైస్తవుని పూచీయైయున్నది. మనము దేవుని చిత్తమును సంపూర్ణముగా యెరుగ గలమా? ఈ లేఖన భాగములను జాగ్రత్తగా చదివి ధ్యానించుము. (కొలొ 1 : 9–10; 4 : 12–13; ఎఫె 5 : 17) దేవుని చిత్తము నెరుగుటయు, ఆచిత్తము చొప్పున చేయుటయు మన ఆత్మీయమైన ఆనందమై యున్నవి.

(బి) **సాక్ష్యములో తప్పుట :–** ( లేవీ 5 : 1 )

మాట్లాడవలసినది మాట్లాడక మౌనముదాల్చి యుండుట మూలముగా పాపము చేయుచున్నామని యిక్కడ కనబడుచున్నది. పిరికితనము చేతను, కుటుంబములలోగల దగ్గర సంబంధములను బట్టియు, ఈ పాపమును యెక్కువగా చేయుదుము. (సామె 29 : 24) ఒకడుచేసిన పాపమును యెరిగియు దానిని గూర్చి యేమియు చెప్పక మౌనముగా నుండువాడు పాపము చేసినవాడును అట్టిపాపములో పాలుపొందువాడును నైయున్నాడు. క్రైస్తవులమైన మనము ఈలోకములో ఆయన యొక్క సాక్షులమైయున్నాము. (అపొ. కార్య 1 : 8) ప్రధాన యాజకుడైన కయపయొద్ద సాక్ష్యమిచ్చుటకు ప్రభువు పిలువబడినప్పుడు ఆయన మౌనముగా నుండలేదు. (మత్త 26 : 63) పిలాతు నొద్దకూడ ఆయన గొప్పసాక్ష్యము నిచ్చెను. (I తిమొ 6 : 13) మాటలాడుటకు సమయముకలదు, మౌన

ముగా నుండుటకు సమయముకలదు. (ప్రసం. 3 : 7) అపొస్త
ప్రధానులయొద్ద పేతురు ధైర్యముగా సాక్ష్యమిచ్చెను. (అపో.
కార్య 7 : 1) క్రీస్తుకొరకు సాక్ష్యమిచ్చుటకు పిలువబడినప్పుడు
మనము మౌనముగా నుండకుందుముగాక. ఇంటిలో సాక్ష్య
మిచ్చుటకు మనము పిలువబడినప్పుడు మౌనముగా నుండ
కుందుముగాక. (నిర్గ 12 : 26; ద్వితీ 6 :20; యెహోషు 4 : 6)
సవాలుచేసి క్రీస్తును గూర్చి సాక్ష్యమిచ్చునట్టి సమయము
యోస్థలములోనైన మనకు వచ్చును కొంచె జాగ్రత్త. ఆయన
కొరకు ప్రేమతోను, ధైర్యముతోను మాటలాడవలెను.
(I పేతు 3 : 15) కొన్ని సమయములలో యిది సులువుకాదు.
గాని ఆయన బలమునుబట్టి అన్ని వేళలయందు సాధ్యమగును.
(ఫిలి 4 : 13)

(సి) పవిత్రులుగా నుండుటలో తప్పుట. (లేవి
5 : 2–3) మనము నానావిధములుగా అపవిత్రుల మగు
చున్నాము. ఇశ్రాయేలీయులు అపవిత్ర వస్తువునైనను, అపవిత్ర
మృగ కళేబరమునైనను, అపవిత్రమైన ప్రాకెడు జంతు
కళేబరమునైనను ముట్టిన యెడల అపవిత్రులైరి. అపవిత్రు
లైన మనుష్యుని ముట్టుకొను యిశ్రాయేలీయుడు అపవిత్రుడే!
మృగముయొక్క మృతకళేబరమును ముట్టిన యిశ్రాయేలీ
యుడు ఒక దినమువరకు అపవిత్రుడుగా నుండెను. (లేవీ
11 : 31) మనుష్యునియొక్క శవమును ముట్టిన యిశ్రాయేలీ
యుడు యేడు దినములవరకు అపవిత్రుడుగా నుండెను.

(సంఖ్యా 19 : 11) ఎంత ముఖ్యమైనసత్యము యీ సందర్భములో యిమిడియున్నది ? దేవుని దృష్టిలో మానవుడు యెంత అపవిత్రుడుగా నున్నాడో కనిపించుచున్నది. (యెష 64 : 6) పవిత్రపరచుకొనవలెనంటే మనము ప్రత్యేకముగా నుండవలెను. వివాహములలోను, వ్యాపారములలోను, సహవాసములలోను (II కొరింథీ 6 : 14 — 7 : 1) పవిత్రులమై యుండవలెను. లేవీ 5 : 2 లోని అపవిత్ర జంతువులు మనుష్యునికి వెలపటి సంగతులై యున్నవి. (లేవీ 5 : 3) మనుష్యునియొక్క అపవిత్రత మనలో నున్న అపవిత్రతకు గురుతుగా నున్నది. (II కొరింథీ 7 : 1) యెహెజ్కేలు దినములలో యాజకుల పాపమేమనగా ప్రతిష్ఠతమైన దానికిని సాధారణమైన దానికిని భేద మెంచకపోవుటయే. (యెహెజ్కే 22 : 26).

(డి) **అనాలోచనగా మాటలాడుటవలన కలుగు పాపము**:— దావీదు ప్రార్థించినట్లు మనమును ప్రార్థించిన బాగుండును. "యెహోవా ! నా నోటికి కావలియుంచుము." (కీర్త 141 : 3) మన పెదవులతో కానిమాటలు యెన్నిసార్లు పలికియున్నాము. మోషేకూడ యీ పాపమును చేసి యున్నాడు (కీర్త 106 : 33) నీవు దేవుని సన్నిధిని అనాలోచనగా పలుకుటకు నీహృదయమును త్వరపడనీయకుము. (ప్రసంగి 5 : 2) మరియు మత్త 5 : 37; 12 : 36 వచనములను ధ్యానించుము. మాటలాడవలసివచ్చినపుడు మాటలాడకుండుటలో

పాపమున్నది. మాటలాడకూడని విషయములో మాటలాడుటలో పాపమున్నది. ఈ రెండు విధములైన పాపముల విషయములో మనము అపరాధులము కాదా? దేవునికి కృతజ్ఞతావందనములను చెల్లింతము. ఎందుకనగా మన సమాధానబలియైయున్న యేసునందు ఆయన మన పాపములను క్షమించుచున్నాడు. "అయ్యో నేను అపవిత్రమైన పెదవులు గలవాడను, అపవిత్రమైన పెదవులుగల జనులమధ్య నివసించుచున్నాను," అని యెషయా ఒప్పుకొనినప్పుడు దేవుడు ఆయనను బహుగా క్షమించియున్నాడు. (యెష 6 : 5 – 7; I యోహా 2 : 1–2)

2. **క్షమాపణ:–** పాపపరిహారార్థబలిలో "క్షమాపణ" యనునది చాల ప్రాముఖ్యమైనది. (లేవి 4 : 20, 26, 31; 5 : 10) మనము దేవుని వలన బహుగా క్షమించబడియున్నామన్న అనుభవమును తెలిసికొనుట యెంతో మనోహరమైన సంగతి. "తన అతిక్రమములకు పరిహారమునొందిన వాడు ధన్యుడు," అని దావీదు చెప్పినపుడు యిట్టి గొప్ప ఆనందమును అనుభవించెను. ఈ ఆనందములో పౌలుకూడ పాలు పొందెను. (రోమా 6 : 4–7) అపోస్తలుడైన యోహాను "చిన్నపిల్లలారా! ఆయననామమును బట్టి మీ పాపములు క్షమించబడియున్నవి." గనుక మీకు వ్రాయుచున్నానని వ్రాసినపుడు యీ ఆనందమును పొందెను. (I యోహా 2 : 12) తన సాక్ష్యములో శేషించినవారి దోషమును పరి

హరించి తాను శేషించిన అతిక్రమముల విషయమై వారిని క్షమించు దేవుడవైన నీతో సమానమైన దేవుడున్నాడా? (మీకా 7 : 18) యేసుక్రీస్తు మనకొరకైన పాపపరిహారార్థబలియై యున్నాడు గాన మనము ఆయనయందు బహుగా క్షమించబడియున్నాము. (యెష 55 : 7)

3. పవిత్రత:— (లేవి 4 : 4 – 12; 6 : 27; హెబ్రీ 9 : 11–14; 10 : 4–10; 13 : 11–13) ఇశ్రాయేలీయుల యొక్క నివాసస్థలము అపవిత్రమైనది. గాన పాపపరిహారార్థ బలిని దహించుటకు తగినదికాదు. (లేవీ 4 : 12) పవిత్రమైన స్థలములో మాత్రమే యీ బలి దహించబడవలసినది. పాపపరిహారార్థబలి మిక్కిలి పరిశుద్ధమైనది. గాన వారి మకాము లలో దహింపబడకూడదు. యేసుక్రీస్తు మన పాపపరిహారార్థ బలియై యుండి మన పాపములను మ్రానుమీద మోసికొనెను. (I పేతు 2 : 24) పరిశుద్ధత అనుమాట పాపపరిహారార్థబలి అనుమాటతో జతగావచ్చుచున్నది. (లేవి 6 : 17, 25, 29) సిలువలో చిందించబడిన యేసుక్రీస్తు రక్తమువలన మనము పరిశుద్ధ పరచబడియున్నామని యీ లేఖన భాగములు చూపించుచున్నవి. మనము కేవలము క్రీస్తువారము. మనము మన వారముకాము. విలువబెట్టి కొనబడినవారము. (I కొరిం 6 : 20; II కొరిం 5 : 14–19)

## పాప పరిహారార్థ బలి నర్పించువారు

పాపము వలననే దేవునితోటి మన సహవాసము తెగిపోయినది. దేవుని సేవకుని లోనికి యేదైన పాపము వచ్చిన యెడల అతడు దానిని ఒప్పుకొననియెడల దేవుని సేవను జయ

ప్రదనముగా చేయనేరవు. పాపపరిహారార్థబలియొక్క పశు రక్తము దేవుని సన్నిధిని అడ్డతెరయెదుట యేడుమార్లు ప్రోక్షింప బడినది. ధూపవేదికయొక్క కొమ్ములమీదకూడ రక్తము రాం చెము ప్రోక్షింపబడినది. మన ప్రార్థన జీవితముకూడ పాపము వలన అపవిత్రపరచబడినదని సందేహమూలముగా గ్రహించు చున్నాము. (కీర్త 66 : 18; 141 : 2; I పేతు 3 : 7; ప్రక 8 : 1—4) బలిపీఠముయొక్క అడుగుభాగమున పశు యా రక్తము పోయబడినట్లు కనబడుచున్నది. (లేవి 4 : 7, 8; రోమా 12 : 1—2) పాపము దేవుని నుండి మనలను యెల్లప్పుడును వేరుచేయునదిగా ఉన్నది. దావీదు దేవుని యెదుట తన పాపమును ఒప్పుకొనుచున్నాడు. (కీర్త 51) దావీదు యొక్క పాపఫలితము లేమి? (1) హృదయశుద్ధి పోయినది. (కీర్త 51 : 1—2, 7, 10) (2) సహవాసము పోయినది. (కీర్త 51 : 11; న్యాయాధి 16 : 20; యెహోషు 7 : 10 — 13) (3) రక్షణ ఆనందము పోయినది. (కీర్త 51 : 12) (4) ఆత్మ శక్తి పోయినది. (కీర్త 51 : 13) "దేవా! నన్ను పరిశోధించి నా హృదయమును తెలిసికొనుము. నన్ను పరీక్షించి నా ఆలోచనలను తెలిసికొనుము. ఆయాసకరమైన మార్గము నా యందున్నదేమో చూడుము. నిత్యమార్గమున నన్ను నడిపించుము." (కీర్త 139 : 23—24) ఇట్టి ప్రార్థనను మనమందరము చేయుదుముగాక!

# పాపపరిహారార్థబలి నాలుగువిధములైన మనుష్యులకు అగత్యము.

1. అభిషిక్తుడైన యాజకుడుచేసిన పాపమునకు— "అతని పాపము తెలియ బడిన యెడల" అను మాటలు యాజకుని నిమిత్తము ఉపయోగించబడలేదు. గాని యితరులు పాపముచేసినపుడు వారినిమిత్తము ఉపయోగించబడినవి. (లేవీ 4 : 14, 23, 28) దేవునితో నెనడిన సహవాసము కలిగియున్న వారు పాపమునుగూర్చిన గ్రహింపు హెచ్చుగా కలిగియున్నారని అర్థమగుచున్నవి. అభిషిక్తుడైన యాజకుడు పాపము చేసెను అనుమాట లేవీ 10 వ అధ్యాయములో మొదటి సారిగా కనిపించుచున్నది. దేవుని యాజకులు పాపము చేసిన యెడల దేవునికి నష్టము కలుగుచున్నది. ఇతడు పాపముచేస్తే బలిపీఠముమీద బలి లేదు. సహవాసము లేదు. మరియు స్తుతి గీతము లేదు. కావున నీవు బలిపీఠమునొద్ద అర్పణము అర్పించు చుండగా నీ మీద నీ సహోదరునికి విరోధమేమైనను కలదని అక్కడ నీకు జ్ఞాపకము వచ్చినపక్షమున అక్కడ బలిపీఠము యెదుటనే నీ యర్పణము విడిచిపెట్టి మొదట వెళ్ళి నీ సహోదరునితో సమాధానపడుము. (మత్తై 5 : 23—24) ఇవి చాల ప్రాముఖ్యమైన మాటలు. ఈ మాటలను మనము ధ్యానించిన యెడల మనలోని కలహములు త్వరగా యెగిరిపోవును. దేవుని ప్రజలతో మనము సమాధానము కలిగియుండనియెడల దేవునితో యేలాగు సహవాసముకలిగియుందుము. (I యోహా

4 : 20–21) అభిషిక్తుడైన యాజకుని తప్పితము కొరకు పాప పరిహారార్థబలి అర్పించబడియుండుట యెంత ధన్యకరమైనది !

**2. సంఘము యొక్క పాపము:–(లేవీ 4 : 13–21)**

ఈ విధమైన పాపము జనాంగ మంతటికి కీడు తెచ్చేదిగా వున్నది. నానా లేఖన భాగములలో ఇశ్రాయేలీయులు యీ విధమైన పాపము చేసినట్టు కనుగొందుము.

(1) బంగారుదూడ. (నిర్గమ 32 : 1–35)

(2) హాయియొద్ద ఓడిపోవుట. (యెహో 7 : 1–13)

(3) వేగులవారి యొక్క మూలుగులు. ( సంఖ్యా 14 : 1–45)

(4) ఇశ్రాయేలీయులు రాజును కోరుట. (I సమూ 8 : 4–20)

(5) ఇశ్రాయేలీయులు బయలు దేవతను ఆరాధించుట. (I రాజు 18)

(6) ఎఫెసీయులు మొదటిప్రేమను విడుచుట. ( ప్రక 2 : 4)

(7) ఆత్మీయమైన నులివెచ్చన. (ప్రక 3 : 14–17)

ఆత్మీయమైన ఉజ్జీవము మనకు కావలెనా ? అలాగైన యెడల సంఘమంతయు తన పాపమును నులివెచ్చని తనమును ఒప్పుకొని దేవునిని వెదకుదుము గాక. సంఘమువొక్క పాపమనేది చాల భయంకరమైన సంగతి. దేవుని బిడ్డలయొక్క ఆత్మీయమైన యెదుగుదలను అది పాడుచేయును! అట్టి పాప

మును సంఘముయొక్క కంటికి మరుగు చేయవచ్చును గాని దేవుని కంటికి సమస్తమును మరుగు లేక తేటగా యున్నది. (హెబ్రీ 4 : 13) సంఘములో పాపముఉంటే విజయము లేదు. (యెహో 7 : 4, 10, 12) సంఘములో పాపముంటే అతి శయము కూడ అక్కడనే యుండును. (I కొరిం 5 : 1–2) సంఘముయొక్క పాపము నిమిత్తము బలిని తీసికొనిరావలసిన పూచీ సంఘపెద్దలమీద నున్నది. (లేవీ 4 : 15) ప్రియ చదువరీ! నీవు ఒక సంఘ పెద్దవా? పాపముచేసిన క్రైస్తవుని తిరిగి రక్షకుని యొద్దకు నడిపించుచున్నావా? సంఘపెద్దవై యున్నందుకు నీ పూచీ చాల పెద్దది. కొరింథీయుల సంఘ పెద్దలు ఆత్మీయమైన మనస్సాక్షి గలవారు కారు. (I కొరిం 5 : 1–2) మాదిరి సంఘపెద్ద యేలాంటివాడో I పేతు 5 : 1–4 వచనములలో కనిపించుచున్నది. ప్రియ చదువరీ! నీవు యీ లాంటి సంఘపెద్దవా?

3. **అధికారియొక్క పాపము:**–(లేవీ 4 : 22–26) ఇది కూడ చాలఘోరమైన సంగతియైయున్నది. సంఘపెద్దలు సంఘములకుమాదురులుగా నుండవలసిన వారైయున్నారు. (I పేతు 5 : 1–3; I థెస్స 2 : 5–12) క్రొత్తనిబంధనలో సంఘపెద్దలు నానా విధములుగా వివరించబడి యున్నారు. (I తిమొ 3 : 1–7; హెబ్రీ 13 : 7, 17; I థెస్స 5 : 12–13) యేయే పాపములు చేయకుండ సంఘపెద్దలు జాగ్రత్తపడవలెను? (I తిమొ 3 : 1–10; తీతు 1 : 7) సంఘములోని సంఘపెద్దలు

మైనా పాపములను చేయకుండ జాగ్రత్త పడవలసియున్నది. గత కాలములో యిట్టిపాపమునుచేసి అపవిత్రులై యున్న యెడల వారు ప్రభువునెదుట ఒప్పుకొనినయెడల దేవుడు వారిని క్షమించును. ఎందుకనగా యేసుప్రభువు మన పాప పరిహారార్థ బలియై యున్నాడు.

4. **సామాన్యజనులయొక్క పాపము:**-(లేవీ 4 : 27–35) ఈ పాపముకూడ ఘోరమైనదే! ఎందుకనగా మనమందరము ఒక్కశరీరముయొక్క అవయవములమై యున్నాము. ఒక్క అవయవము బాధ ననుభవించినయెడల తక్కిన అవయవములన్నియు బాధించబడుచున్నవి. ( కొరిం 12 : 27) తేలు చిటికెనవ్రేలును కుట్టినయెడల ఆబాధను తక్కిన అవయవములు కూడ అనుభవించును. శరీరమంతయు ఆ బాధ ననుభవించును. ఆబాధ తగ్గువరకు శరీరమంతయు సుఖములేక బాధను అనుభవించును. పాపాత్ముడు అనేకమైన మంచిపనులను చెరుపును. (ప్రసంగి 9 : 18) కొంచెము పులిపిండి ముద్దనంతటిని పులియునట్లు చేయును. (I కొరిం 5 : 6) యేసుక్రీస్తు మనకొరకైన పాప పరిహారార్థబలియైయుండి తన రక్తముచేత మన పాపములను పరిహరించుచున్నాడు గాన మనమెంతగానో దేవునిని స్తుతించ బాధ్యులమై యున్నాము.

# 5. అపరాధ పరిహారార్థ బలి

(లేవి 5 : 14–19; 6 : 1–7; 7 : 1–7) అపరాధపరిహారార్థబలి అనేకమైన పోలికలనుబట్టి పాపపరిహారార్థ బలి వంటిదిగా నున్నది. వీటినిగూర్చి లోతుగా ధ్యానించినయెడల వాటియొక్క తారతమ్యములు బహుగా కనిపించును. పాప పరిహారార్థబలి హృదయములోనుండి బయలుదేరు పాపముతో సంబంధము కలిగియున్నది. (యిర్మి 17 : 9) అపరాధ పరిహారార్థబలి పాపకార్యముతో సంబంధము కలిగియున్నది. (మార్కు 7 : 21–23) ఈ రెండును ఒకటి జన్మపాపమును రెండవది కర్మపాపమును చూపించుచున్నవి. పౌలు సంఘమును హింసించినపుడు పాపము చేసియున్నాడు. గాన పాప పరిహారార్థబలి అవసరమాయెను. ఎందుకనగా అతడు ఆ పాపమును అవిశ్వాసమును బట్టియు, తెలియని తనమును బట్టియు చేసెను. (I తిమొ 1 : 13) పేతురు ప్రభువును యెరుగనని అబద్ధమాడినపుడు యెరిగియే పాపముచేసెను. ఇతడు అపరాధము చేసెను గనుక అపరాధపరిహారార్థబలి అవసరమాయెను. (లూకా 22 : 31–34, 54–62) అపరాధపరిహారార్థబలి అన్ని వేళలయందును వ్యక్తిగతముగా అర్పించబడెను. గాని సంఘముకొరకు కాదు. పాప పరిహారార్థబలిలో వివిధ రకములు కనిపించుచున్నవి. గాని అపరాధ పరిహారార్థ బలిలో పొట్టేలు మాత్రమే కనిపించుచున్నది. (లేవి 5 : 15 – 18; 6 : 6) వాటన్నిటి రక్తము బలిపీఠముచుట్టు ప్రోక్షింపబడినది.

పాప పరిహారార్థబలి యొక్క రక్తము బలిపీఠము యొక్క కొమ్ములమీద ప్రోక్షింపబడినది. (లేవీ 4 : 7, 18, 25, 30) పాప పరిహారార్థబలియందు ఈ బలి నర్పించువాడు పాపము వలని నష్టము నిచ్చుకొనన క్కర లేదు. అపరాధపరిహారార్థబలి విషయములోనైతే బలి నర్పించువాడు పాపమువలన కలుగు నష్టమును యిచ్చుకొనవలెను. అపరాధ పరిహారార్థ బలి నర్పించ బడవలసిన మూడు విధములైన అపరాధములు గలవు.

1. పరిశుద్ధమైన వాటి విషయములో పొరపాటు చేయుట. (లేవీ 5 : 15–16)

2. చేయకూడదని దేవుడాజ్ఞాపించిన వాటివిషయములో పొరబాటుచేయుట. (లేవీ 5 : 17–19)

3. పొరుగువానియెడల అపరాధముచేయుట. (లేవీ 6 : 1–7) పరిశుద్ధమైన వాటి విషయములో పొరబాటు చేయుట అను అపరాధము దేవుని దృష్టిలో మిక్కిలి జాగ్రత్తగా పాటించవలసిన సంగతియైయున్నది.

## అపరాధములు యేవేవి?

1. దశమ భాగముల నివ్వక యుండుట. (లేవీ 27 : 30–32; సామె 3 : 9; మలాకీ 3 : 8–12)

2. అనాలోచనగా దేవుని సన్నిధిలో పలుకుట. (ప్రసంగి 5 :1–3; కీర్త 141 : 3)

3. దురుద్దేశముతో సేవచేయుట అనగా లాభము సంపాదించుటకొరకు దైవసేవచేయు ఉద్దేశము. (1 థెస్స 2 : 3–6; ఫిలిప్పీ 1 : 15)

4. క్షమించని బుద్ధి. (మార్కు 11 : 25; మత్త 5 : 23–24; ఎఫె 4 : 32)

5. కళంకమైనదానిని దేవునికి బలిగా తెచ్చుట. (ద్వితీ 17 : 1; మలాకీ 1 : 7–8)

6. తన్నుతాను పరీక్షించుకొనని హృదయముతో దేవుని బల్లయొద్దకు చేరుట. (I కొరిం 11 : 27–29)

## సహోదరునికి వ్యతిరేకమైన అపరాధము :—

(లేవీ 6 : 1–7) మనము మన సహోదరునికి వ్యతిరేకముగా పాపము చేసిన యెడల ఆ పాపము దేవునికిని వ్యతిరేకమైనదే. దావీదు ఊరియాకు వ్యతిరేకముగా పాపము చేసినపుడు ఆ పాపము దేవునికి విరోధముగా చేయబడియున్నట్టు వ్రాయబడి యున్నది. (II సమూ 11 : 1 – 27; కీర్త 51 : 4; II సమూ 12 : 13) ప్రతి మానవునియొక్క పాపము మొదట దేవునికి వ్యతిరేకమైనది. ఎందుకనగా మనలను మనము ప్రేమించుకొనునట్లు మన పొరుగువానిని ప్రేమించని యెడల దేవుని ఆజ్ఞను భంగపరచి ఆయనకు వ్యతిరేకముగా పాపము చేసినవారమగుదుము. (లేవీ 6 : 1–4) ఒకడు తన పొరుగు వానికి వ్యతిరేకముగా చేయు వివిధములైన అపరాధములు :—

1. అబద్ధమాడుట. (కొలొ 3 : 9; I రాజు 13 : 1–18)
2. అపనమ్మకముగ చూపుట, (యెహోషు 7 : 1, 12, 21–23; ఎఫె 4 : 28)
3. బలత్కారము. (I రాజు 21 : 1–13; లూకా 3 : 14)

4. మోసము. (ఆది 27 : 6–25; I కొరిం 5 : 8)

5. దేవుని నామమున అబద్ధ ప్రమాణము చేయుట. (మార్కు 14 : 56–59; నిర్గ 20 : 16) ఈ అయిదు విధములైన పాపములవలనగాక మరియేవిధముచేతనైనను మనము మన పొరుగువానికి కీడు చేయలేము. ఈ అయిదు విధములైన పాపములు క్షమించబడును. గాని ఖూని చేసినయెడల శిక్షించబడవలసినదే. దీనికి క్షమాపణలేదు. మనము మన పొరుగువానిని మరియు మన శత్రువులనుకూడ ప్రేమించవలెననియే దేవుని ఆజ్ఞ. (మత్తై 5 : 44) మనము మన పొరుగు వానికి వ్యతిరేకముగా పాపము చేసినయెడల దేవునికిని వ్యతిరేకముగా పాపము చేసియున్నాము. మనము మన పొరుగు వానిని ప్రేమించిన యెడల పైన చెప్పబడిన పాపములను అతనికి చేయము. (గల 6 : 10)

అపరాధ పరిహారార్థబలి మొదటగా మనకు మన పొరుగువానితో మంచిసంబంధమును కలిగించును. రెండవదిగా హానిపొందినవాని మనస్సులోనుండి కష్టమును తీసివేయును. ఈ రెండువిధములైన మేలును చేయుటకు అపరాధ పరిహారార్థబలి దేవుని వలన నియమించబడి యున్నది. యేసు క్రీస్తు తప్ప ఎవడు దీనిని సంపూర్ణముగా చేయగలడు? మనుష్యుడు దేవుని స్వరూపమందు సృజింపబడెను. మహిమా ప్రభావములతో అతనికి కిరీటము ధరింపబడియున్నది. (కీర్త 8 : 5) పాపమువలనను అవిధేయతవలనను మనుష్యుడు తన

కీర్తమును పోగొట్టుకొని యున్నాడు. (విలాప 5 : 16) మను
ష్యుడు యెట్లు ఆ మహిమను తిరిగి సంపాదించగలడు ? క్రీస్తు
సిలువలో చనిపోయినప్పుడు దేనిని మనుష్యుడు చేసికొనలేడో
అతనిపక్షమున క్రీస్తు దానిని చేసియున్నాడు. నేను దోచు
కొనని దానిని నేను ఇచ్చుకొనవలసివచ్చెను. (కీర్త 69 : 4)
ఈ వాక్యములో అయిదవవంతునుగూర్చిన దేవుని నియమము
తేటగా కనిపించుచున్నది. దేవునికి వ్యతిరేకముగా చేసిన అపరా
ధము నిమిత్తమును, (లేవి 6 : 5) పొరుగువానికి వ్యతిరేక
ముగా చేసిన అపరాధము నిమిత్తమును, (లేవి 6 : 4—5) ఈ
అయిదవ వంతును గూర్చిన దేవుని నియమము చెందుచున్నది.
అపరాధము చేసినవాడు తన అపరాధము కొరకు దేవునికి
పొట్టేలును అర్పించుటమాత్రమేగాక తాను అన్యాయముగా
తీసివేసిన దానిని దానితో అయిదవ వంతును మరల యివ్వ
వలసివచ్చెను. ఈ అయిదవ వంతును గూర్చిన నియమము
మొదటగా ఆది 47 : 18—26 వచనములలో కన్పించుచున్నది.
ఈ అయిదవ వంతును గూర్చిన దేవుని నియమము. లేవి
22 : 14–16 వచనములలో మరల కన్పించుచున్నది. లేవి 20 వ
అధ్యాయములో ఈ అయిదవ వంతును గూర్చిన దేవుని నియ
మము నాలుగు సంగతులతో సంబంధము గల్గియున్నది.

(1) మ్రొక్కుకొనినదానిని విడిపించుట. (లేవి 27 : 13)

(2) ప్రతిష్ఠింపబడిన యింటిని విడిపించుట. (లేవి 27 : 15)

(3) అపవిత్రమైన జంతువుల తొలి పిల్లను విడిపించుట.
(లేవీ 27 : 27)

(4) దశమభాగములను విడిపించుట.(లేవీ 27 : 30–31)

లేవీ 5 : 16; 6 : 5 వచనములను మరియొక సారి ధ్యానింతము. ఉదా:- యోనా అను ఇశ్రాయేలీయుడు సంసోను అను మరియొక ఇశ్రాయేలీయునికి హానికల్గించెనను కొనుము. ఆ నష్టము ఒక వందరూపాయలు అనుకొందము. యోనా, తాను దేవునికిని, తన పొరుగువానికిని వ్యతిరేకముగా ఉద్దేశపూర్వకముగా పాపము చేసియున్నానని గ్రహించియున్నాడు. యోనా అపరాధపరిహారార్థబలిగా ఒక నిర్దోషమైన పొట్టేలును దేవునికి అర్పించవలెను. మరియు అతడు ఆ నూరు రూపాయలును వానిలో అయిదవ వంతు ఇరువై రూపాయలును మొత్తము నూట ఇరువది రూపాయలను సంసోనుకు యివ్వవలెను. గనుక యోనా యొక్క పాపమునకు ప్రాయశ్చిత్తము చేయబడినందువలన సంసోనుకు అయిదవవంతు లాభము కల్గినట్లు కన్పించుచున్నది. అందువలన దేవునికిని తన పొరుగువానికిని మంచి సంబంధము కలిగియున్నది. మానవుల పాపపరిహారమునిమిత్తము కలువరిలో క్రీస్తు ప్రాయశ్చిత్తము చేసినపుడు ఆయన దేవునికి ఆదాము పాపముచేసి పోగొట్టుకొనిన మహిమకంటె విశేషమైన మహిమను యిచ్చియున్నాడు. (యోబు 33 : 24; కీర్త 49 : 6–9; మార్కు 10 : 45; I తిమో 2 : 6) యేసుక్రీస్తునందు పాపా

త్ములమైన మనము ఆదాము తన పాపమువలన పోగొట్టుకొనిన ఆశీర్వాదముకంటె ఎక్కువయిన ఆశీర్వాదమును పొందు చున్నాము. రోమా అయిదవ అధ్యాయములోని ఈ క్రింది వచనములు విశేషమైన మహిమ దేవునికిని విశేషమైన ఆశీర్వాదము మనకును కలుగుచున్నదని చూపించుచున్నవి. (రోమా 5 : 9, 10, 15, 17, 20–21.)

దేవుడు నియమించిన ఆరాధన పద్ధతినే మనము ఆయనను ఆరాధించవలెను. మనము చేయు ఆరాధనయందు సహా ఒకానొకప్పుడు పాపము ప్రవేశించును. పశ్చాత్తాపమువలన కలుగు మన కన్నీళ్ళుసహా యేసుక్రీస్తు రక్తము వలన పవిత్ర పరచబడవలెను. మనము కూర్చుండి నెమ్మదియైన మనస్సుతో దేవుని యెడల మన జీవితమునుగూర్చియు సేవనుగూర్చియు తల పోసినయెడల ఎంతవరకు తప్పియున్నామో మనకు తేటగా తెలి యును. యెహోవా జ్ఞానముగలవాడై యున్నాడు. ఆయనవలన కార్యములు తూచబడుచున్నవి. I సమూ 2 : 3(పాతతర్జుమా) ఈ సంగతిని మనము బాగుగా గ్రహించవలెను. ఆయన పరి శుద్ధుల సభలో మిక్కిలి భీకరుడు. (కీర్త 89 : 7) గనుక మనము దావీదువలె "నా నోటిమాటలు, నా హృదయ ధ్యానము నీ దృష్టికి అంగీకారములగుగాక." (కీర్త 19 : 14) ఈ ప్రార్థనను మనమును చేయవలెను. బైబిలు గ్రంథములోని పరిశుద్ధులందరు తమ హృదయజాడ్యమును ఎరిగియున్నారు. కీర్త 90 : 8లో మోషేయు, కీర్త 90 : 12 లో దావీదును,

యోబు 42 : 5, 6లో యోబును, రోమా 7 : 18 లో పౌలును తమ హృదయ జాడ్యములనుగూర్చి పలికియున్నారు. మనము ప్రభువును సేవించవలెనని కోరినయెడల పరిశుద్ధాత్ముడు మన బ్రతుకులోని, సేవలోని పాపమును, తప్పితములను మనకు చూపును. (ఎఫె 5 : 13–14; హెబ్రీ 4 : 13; I యోహా 1 : 5–7) మన హృదయములను పరిశోధించుమని మనము నిత్యమును దేవుని ప్రార్థించ బాధ్యులమై యున్నాము. (కీర్త 139 : 23–24) మన బ్రతుకునందును సేవయందును గల తప్పితములను బట్టి అపరాధ పరిహారార్థబలి ఒక విచిత్రమైన సంగతిని మనకు బోధించుచున్నది. అది యేమనగా యేసుక్రీస్తు యొక్క పాపప్రాయశ్చిత్తము దేవునిని మానవుని సంతృప్తి పరచుచున్నది. ఆయనయొద్ద సంపూర్ణ విమోచన దొరకును. (కీర్త 130 : 7)

దేవుని ఆజ్ఞకు వ్యతిరేకమైన పాపము. (లేవీ 5 : 17–19.) ఈ భాగములో తెలియకయే చేయు పాపమును గూర్చి వ్రాయబడియున్నది. ఎరుక లేకయే చేసినపాపములు కూడా దేవునికి వ్యతిరేకమైనవే. గాన అటువంటి పాపము నిమిత్తమును ప్రాయశ్చిత్తము చేయుట అవసరమై యున్నది. ఇష్ట పూర్వకముగానైనను ఎరుకలేకయేనైనను పాపము చేసిన యెడల మనము దేవుని యెదుట అపరాధులమై యున్నాము. ఒకప్పుడు పౌలు క్రైస్తవులను హింసించుచు తాను దేవుని సేవచేస్తూయున్నానని తలంచెను. యోహా 16 : 2లో వారు మిమ్మును సమాజ

మందిరములలో నుండి వెలివేయుదురు. మిమ్మును చంపు ప్రతి వాడు తాను దేవునికి సేవ చేయుచున్నాడని అనుకొను కాలము వచ్చుచున్నది. అని ప్రభువు కూడ శిష్యులకు ముందుగానే చెప్పెను. మన మాయనను ఎట్లు సేవించవలెనో దానిని దేవుడు తన పరిశుద్ధ వాక్యమునందు తేటగా చూపించి యున్నాడు. ఆయన చూపిన మాదిరి చొప్పున మన మాయనను సేవించని యెడల ఆయన యెదుట మనము దోషులమగుదుము. నాదాబు, అబీహులు, అన్యాగ్ని తెచ్చి దేవునికి ధూపము వేయగా వారు దేవుని యెదుట దోషులని తీర్పు చేయబడిరి. (లేవీ 10 : 1–2) ఆకానుకూడ తాను చేసిన దోషమును బట్టి శిక్షింపబడెను. పరిసయ్యులుకూడ దేవునిని అన్యవిధముగా ఆరాధించి దోషులని తీర్చబడిరి. (మార్కు 7 : 7–9) గాన మనము ఆయన పరిశుద్ధ వాక్యములోనుండి ఒకటి తీయుటగాని ఒకటి కలుపుటగాని చేయకుందుము గాక. (సామె 30 : 6; హెబ్రీ 8 : 5; ప్రక 22 : 18–19) పెండ్లిండ్ల విషయములలో మనమెంత తరచుగా తప్పిపోవుచున్నాము! రక్షింపబడిన మన బిడ్డలను అవిశ్వాసులకు పెండ్లికిచ్చు చున్నాము. కులము, పరువు, విద్య, ధనము అను మిషలచేత తప్పుచున్నాము. (II కొరిం 6 : 14–18) ఇట్లు చేయుట మూలముగా దేవునికి మన బిడ్డలకు వ్యతిరేకమైన పాపమును మనము చేయుచున్నాము. మన ప్రభువైన యేసుక్రీస్తు యొక్క శ్రేష్ఠమైన నామమునకు అవఘనత తెచ్చి ఆయన

యొక్క మహామహిమను నీచపరచుచున్నాము. అయినను జనులు దేవునియందు భయభక్తులు నిలుపునట్లు దేవునియొద్ద క్షమాపణ దొరకును. (కీర్త 130 : 4) ఇశ్రాయేలు తన తప్పి తమును తెలుసుకొనిన తరువాత నిర్దోషమైన గొఱ్ఱె పిల్లను అర్పణగా తెచ్చి అర్పించి పాపక్షమాపణ నొందెను. (లేవీ 5 : 17–19) కలువరిగిరిమీద చేయబడిన ఆ దివ్యమైన ప్రాయ శ్చిత్తమును బట్టి దేవునికి స్తోత్రము.

ఈ మాట గమనించుడి : కృప విస్తరింపవలెనని పాప మందు నిలిచియుందుమా ? అట్లనరాదు. (రోమా 6 : 1)

అపరాధ పరిహారార్థబలి బలిపీఠముయొద్ద అర్పించబడి, బలిపశువుయొక్క రక్తము బలిపీఠముచుట్టు ప్రోక్షింపబడెను. బలిపశువుయొక్క కొన్ని అవయవములు బలిపీఠముమీద దహించబడియున్నవి. అనగా పాపము నిమిత్తము దేవుని తీర్పు తీరిపోయినట్లు చూపించుటకు బలిపశువుయొక్క కొన్ని అవ యవములు యాజకునివలన ఆహారముగా భుజింపబడినవి. ప్రతి విశ్వాసియు ఒక యాజకుడై యున్నాడు. (I పేతు 2 : 5) గనుక ప్రతి విశ్వాసియు అపరాధ పరిహారార్థబలి పశువు యొక్క కొన్ని భాగములను భుజింపవలసినవాడై యున్నాడు. యేసుక్రీస్తు చేసిన పాపప్రాయశ్చిత్తమును ప్రార్థనపూర్వక ముగాను సంతోషముతో ధ్యానించిన ఆహారముగా భుజించి నట్లుండును. కీర్త 69 అపరాధ పరిహారార్థబలిని గూర్చిన అధ్యాయమై యున్నది. ఈ కీర్తనలో యేసుక్రీస్తు నేను దోచు

కొనని దానిని నేను యిచ్చుకొనవలసి వచ్చెను అని చెప్పెను. ఆయన మన పాపములను తన పాపములుగ ఒప్పుకొని వాటి నిమిత్తము ప్రాయశ్చిత్తము చేసెను. లేవీగ్రంథములోని బలులు చేయలేనిదానిని యేసుక్రీస్తు సిలువలో చేసియున్నాడు. ఈ అయిదు విధములైన బలులు యేసుక్రీస్తు సిలువలో చేసిన సంపూర్ణ ప్రాయశ్చిత్తమును చూపించుచున్నవి. సిలువలో ప్రభువు చెప్పిన ఆఖరుమాట "సమాప్తమైనది." ఈ విషయములను ఎరిగినవారమై ఆయనకార్యమును మహిమపరచుచు అనుదినము ఆయన రక్షణసువార్తను ప్రకటించుదము. (కీర్త 96 : 2)

"యేసూప్రభూ నాకొరకై — మోసితివా సిలువను —
దోసభరితుని మోక్ష — వాసు జేసుటకై —
భాసురంబుగ ప్రభువా నీచలోకములో ప్ర — యాస
మొందితివా నా — దోస పరిహారముకై."



# C. P. H. PUBLICATIONS

1—4—0 యాత్రికుని ప్రయాణము.

1—0—0 సత్యవేదసారము: ప్రార్థనా జీవితము.

0—12—0 హడ్సన్ టేలర్.

0—10—0 ఆత్మలను సంపాదించుటకు దేవుని సంకల్పము.

0—8—0 మీరు పరిశుద్ధాత్మను పొందితిరా?; I కొరింథీయుల పత్రిక వివరణ; పండిత రామాబాయి; వెలుగులోనికి.

0—6—0 కనానుయాత్ర; బైబిలు గ్రంథ బోధలు; క్రైస్తవ జీవిత విషయం; ప్రకటన గ్రంథము (రెండుభాగములు); సంఘమునకు దేవుని పిలుపు; ప్రధాన యాజకుని వస్త్రములు; కొరియాకథ; సత్యవేద పఠన; లేవీయ కాండమందలి అర్పణలయందు గుప్తమైన క్రీస్తుప్రభువు.

0—4—0 జయించు జీవితము; మంచి పోరాటము; ప్రత్యక్షపు గుడారము; పరిశుద్ధాత్మ.

0—3—0 ఇద్దరి మేకులు; బాలకథలు; దేవుని సేవకుడు.

0—2—0 ఆవిహాతుపు.

0—1—6 క్షేమనిశ్చయతానందములు.

0—1—0 సాటిలేని క్రీస్తుప్రభువు; దశమభాగము దేవుని ఆశీర్వాదము; బిల్లిగ్రేహం: మధుసూదనస్సా - మతాన క్రియా?; సాధు సుందర సింగ్; సత్యవేదపు ప్రారంభవిద్య.

0—0—6 యేసు నామము గాక వేరొక నామము లేదు (ఇంగ్లీషుకూడ); శాశ్వతమైన భద్రత; బైబిలు గ్రంథ వివరణ; సత్యాగ్రహము - క్రీస్తు; నేను లోనికిరాను: దేవాలయమందు దర్శనము; బైబిలు అనుదినక్రమము; దేవుడు-ద్వారము: ప్రాణమునకు ప్రాణము; క్రీస్తు ప్రభుని ఆగమనము యొక్క నిశ్చయత; క్రీస్తు ప్రభువు నీకేమైయున్నాడు?

ఇంకను వాక్యపు అట్టలు, గోడ వాక్యములు, కరపత్రములు
వివరములకు వ్రాయుడి. పోస్టేజి ప్రత్యేకము.

## క్రిష్టియన్ పబ్లిషింగ్ హౌస్,

పోష్టుబాక్సు 36. రాజమండ్రి.

వెల 0—6—0 Price 0—6—0